# హరికథలు

## అదిభట్ల నారాయణదాసుగారి

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంపూర్ణరామాయణము | 4 | 0 | భగవద్గీత | 0 | 8 |
| జానకీ శపథము | 1 | 0 | హరికథా శ్రీహరికథామృతం | 1 | 4 |
| రుక్మిణీ కల్యాణము | 0 | 12 | బుక్సంగ్రహః మొక్కుబడి | 1 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 | విష్ణుసహస్రనామసంకీర్తనము (వెన్నుని వెయ్యిపేర్ల వినకరి సహస్ర నామములతో సమకూర్చినపద్యములు) | 0 | 8 |
| మార్కండేయ చరిత్ర | 0 | 12 | వేల్పునంద (పద్యములు) | 1 | 0 |
| అంబరీష చరిత్ర | 0 | 8 | సూర్యనారాయణ శతకము | 0 | 8 |
| గజేంద్రమోక్షము | 0 | 3 | అచ్చతెనుగు పలుకుబడి | 0 | 4 |
| ప్రహ్లాద చరిత్ర | 0 | 8 | | | |
| భీష్మ చరిత్రము | 0 | 8 | | | |
| సావిత్రీ చరిత్రము | 0 | 12 | | | |
| గౌరప్పపెళ్లి (పా॥కల్యాణం) | 0 | 8 | | | |

## పరిమి సుబ్రహ్మణ్యదాసుగారి

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంపూర్ణ మహాభారతము 22 కథలు | 3 | 0 | సుమతీ చరిత్ర | 0 | 8 |
| ధన్వంతరి చరిత్రము | 0 | 8 | ప్రమీలార్జునీయం (భారతం అనంతరం గాని మధ్య భాగములో గాని జెప్పదగు కథ) | 0 | 8 |
| నలచరిత్రము | 0 | 8 | రసికానందము (సమయస్ఫూర్తిగ చదువుటకు చమత్కృతిగా వ్రాయబడిన పద్యములు) | 0 | 8 |
| రఘుకుల చరిత్ర | 0 | 8 | సాయిబాబా (నూతన భక్తి) | 0 | 8 |
| తులసీ ప్రభావము | 0 | 8 | చారురేఖ (తులసీప్రభావము) | 0 | 8 |
| సంపూర్ణ శ్రీకృష్ణభాగవతము 18 కథలు గలది | 3 | 0 | సుభాష్‌చంద్రబోస్ 1 భా॥ | 0 | 12 |
| లక్ష్మీకల్యాణ మను క్షీరసాగర మథనము | 0 | 8 | నేతాజీ 2 భా॥ | 0 | 12 |
| శమంతకమణి అను సత్యభామ కల్యాణము | 0 | 8 | మారుతీ చిటికెలు | 0 | 8 |
| పార్వతీ పరిణయము | 0 | 8 | అర్జున గర్వభంగం | 0 | 8 |
| సతీతులసి (జలంధర) | 0 | 8 | | | |

# సంపూర్ణ రామాయణము

## షడంకముల నాటకము

గ్రంథకర్త:

**చక్రావధానుల మాణిక్యశర్మగారు**




పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1956




[వెల రు 1—8—0

తే. జగతిని పాపజీవులను ♦ సంహరణం బొనరింప కర్త మీ
వగుదుపలుంపు సంతత వ ♦ దుష్టవృత్తి నాకు నెన్నొ తం
పగ గమకించె దానవులు ♦ బల్మిని, స్వార్థము చేటిబీరలా
యగతిని నాము చేర కమ ♦ లాకర! సిగ్గుగదా వచింపగన్.

నేను సమర్థుఁడనై రాక్షసులజంపగూడదట. దక్కిన పుణ్య జనుల జంపవలెనట.

అగ్ని—మహాత్మా! సిగ్గువిడచి నా యవస్థను గూడ జెప్పెద నాక ర్ణింపుము.

సీ. అఖిలలోకము దహి ♦ యించునట్టి నన్ను
బలుగురాకాసులే ద ♦ హింపంగ జొచ్చె
నయ్యయ్యో! నాయవస్థ నే ♦ మందునయ్య
దహనుడను పేరు నాకేల ♦ దగులబెట్ట.

అంతియే కాదు. నేను రావణునాంతికమునకు వంటలవాడనై యుండవలసి వచ్చినది. వరుణుడు జలములను గూర్చవలయునట. వాయుదేవుడు వీధుల నూడ్చి పరిశుభ్రపరచవలెనట

బ్రహ్మ—ఓ యింద్రాగ్నియములారా! మీరు చింతిల్లకుడు. రావణుని దౌర్మార్గ్యమే వానిని సంహరింపగలదు అల్లదే రక్కసుల బ్రేగు సహింపలేక వసుంధరాదేవి నారాయణునితో మొరబెట్టుటకై కాలిలో నీలాగే వచ్చుచున్నది. ఆమె ననుసరించి మనమును నారాయణుని వేడుకొందము.

వసుంధరాదేవి—(ప్రవేశించి)

ఉ. శ్రీలలనా మనోరమణ ♦ శేషశయాన దురాత్మ రావణో
ద్వేలభరంబు నే ననుభ ♦ వింపగజాలనఘప్రచారమే
చాలగ విస్తరిల్లెను నృ ♦ శంసులు సాధ్వుల మానభంగమే
శైశనుజేయు నాయకుము ♦ ప్రేగును మోయగజాల బ్రోవవే.

విష్ణు—అమరులారా! కొంతకాలము సైరింపవలయును. నేను మను కులమున దశరథునకు రాముడనై యవతరించెదను. నాశంఖ చక్రములు భరతశత్రుఘ్నులుగను శేషుడు లక్ష్మణుడుగను జనింపగలరు. లక్ష్మి సీతయై పుట్టును. రావణుడు సీతను దస్కరించును. మీ దేవత లందరు వానరాంశతో జనించుడు. నేనా రావణుని సంహరించి మీ యలమట దీర్చెదను. అంతవరకు సహించియుండవలెను.

వసుం—మహాభాగ్యము.

బ్రహ్మ—భగవన్నారాయణా! మీరామావతారమునకై నిరీక్షించుచుందుము.

(అందరు నిష్క్రమించెదరు.)

(తెర పడును)



2 వ రంగము—సభాభవనము.

[దశరథ వశిష్ఠులు ప్రవేశించెదరు]

దశర—ఆచార్యోత్తమా! వశిష్ఠ మునివర్యా!

చ. సుతుల నవోపనీత పరి ♦ శోభితులౌనటు చేసినాము స
న్మతి ధనురాగమార్గ నిగ ♦ మంబుల బోధనొసర్చి శాస్త్రసం
తతుల రహస్యముల్ దెలిపి ♦ ధన్యులజేయవె! దేశికేంద్ర! మీ
యతులిత సత్కృపామహిమ ♦ నందకతుత్రలు ధీయులౌదురే

వశిష్ఠ—ఓ కోసలరమానాథా!

చ. అమలచరిత్రులైన భవ ♦ దాత్మజు లాగమ మంత్రశాస్త్రముల్
సుమహితబుద్ధి నేర్చుటలు ♦ చోద్యము పుట్టుకతోన సర్వశా
స్త్రములు దమంత దావలచె ♦ ధారుణినాథ! త్వదీయపూర్వపు
ణ్యమున మహానుభావు లుద ♦ యంబునగాంచిరి నీకు బుత్రులై.

దశర—స్వామీ! మా రఘువంశంబునందు మీ రాజన్మసుప్రసిద్ధాభిమాన ముండుటం జేసి తథావిధంబుగ బలుకుచుందురు కాని మహావిద్య లేమి తమంతదా వలచుటేమి?

వశిష్ఠ—దశరథ మహీపాలా! నిగర్వచూడామణివైన నీవు పుత్రుల విషయ మట్లు పలుకు టుచితమే కాని రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు నల్వురు నాల్గుదిక్కుల నేలదగినవారు. అందు శ్రీ రామలీలలు

మ. అవనీభార విమోచన క్రియకళా ♦ వ్యాహార శీలంబులున్
స్తవనీయంబులు సత్కృపారస నదీ ♦ సంతానముల్ పాలనాం
కవిలాసంబులు దొష్టసంఘహరణో ♦ త్కంఠంబులున్ ఘోరపా
పవిదాహంబులు రామలీలలని నీ స్వాంతంబునం దెంచుమా.

(తెరలో) జయతు జయతు శ్రీరఘుకుల క్షీరాబ్ధి రాకాసుధాకరః దశరథ మహారాజః

దశర—ఆచార్యోత్తమ! ఆ జయధ్యాన మెవ్వరిదై యుండునో!

వశిష్ఠ—భూపాలమణీ! అలఘుతపోనిధానుడైన విశ్వామిత్ర మునివరుని తలంచెదను.

విశ్వామిత్రుడు—(ప్రవేశించి) జయతు జయతు శ్రీరఘుకుల క్షీరాబ్ధి రాకాసుధాకరో దశరథ మహీపాలః

దశర—(లేచి వినయమున) భగవన్ కౌశిక మునీంద్ర! నా యభివందన మంగీకరించి యీ యుచితాసనము నలంకరించుము.

విశ్వా—వసుంధరారమణ! భవతాం శ్రేయోస్తు. కూర్చుండుము!

దశర—మహాత్మా! విశ్వామిత్ర సంయమీంద్ర!

ఉ. నిరతము నత్తపోధికతఁ * నిస్తులసర్వమఖక్రియాఫలో
త్కర సముపార్జనాధికతఁ * గన్నహిమాద్రి త్వదీయుఖ్యాతియై
వరలెడు నస్మదీయ రఘు * వంశపు రాజులమీఁద నీకృపా
కరణము జూపవచ్చుటను * ధన్యుఁడనైతిని మౌనిచంద్రమా!

స్వామి! మీ చరణకమలం బొనఁగితి రేని పాత్యము నొసంగెను.

విశ్వా—రాజా! నీయత్యాదరరసమే మాకు బాధ్యమైనది. నీవిట్టివాఁడ వలయున కలంకారభూతుడవు నీవలనగదా! అస్మదాదులకు నిత్యానుష్ఠాన జపతపో హోమక్రియాదు లవిచ్ఛిన్నంబుగ జరుగుట!

దశర—నాయందలి వాత్సల్యమున నట్లనుచున్నారు కాని నేనట్టిస్తోత్రమున కర్హుడ నగుదునా?

విశ్వా—నీవందుల కర్హుడవగుటచేత నే నిన్నొకటియాచింప వచ్చితిని.

దశర— మహాత్మా! యాచింపవచ్చితిననకుడు అజ్ఞాపింపవచ్చితిననుడు. మీ చరణదాసుడు మీయాజ్ఞకు కృతాంజలియై సిద్ధముగ నున్నాడు. ఆజ్ఞాపింపుడు. తప్పక మీయభీష్టమును దీర్చెదను.

వసి—(తనలో) ఈపొగడ్తవిన నేదియో రాజునకు మనస్సంకటమును
గల్పింప దలచినట్లున్నది.

విశ్వా—వహా వ్వా! రఘుకులమణివన నీకే చెల్లునోయి! నేనేదియడి
గినది లేదనక యిచ్చెదవు గదా!

దశర—మహాత్మా! మీకాసంశయ మేల!

ఉ. సంతతి లేదు లేదను వి ♦ చారము పోయెను యజ్ఞమూర్తిచే
స్వాంతము నిస్తరంగ సుఖ ♦ దాంబుధి నోలలాడుచుండ ధీ
మంతులు నల్వురాత్మజులు ♦ మౌనివరేణ్య! లభించినార లీ
యంతము లేని మోదసమ ♦ యంబున దీర్చనె! మీయభీష్టమున్.

కావున మీయాప్సితమును జెప్పుడు లేని శిరసావహించి
చేసెదను.

విశ్వా—అటులైన జెప్పెదవినుము.

ఉ. ఎప్పుడు యజ్ఞముల్ జరుప ♦ నెంచిన నప్పుడె దైత్యులెల్ల రా
యప్పరవీథినుండి నవ ♦ నోదిత వేదిక రక్తమాంసముల్
గుప్పనజల్లి యజ్ఞమున ♦ కున్ గడు విఘ్నము లాచరించెద నీ
విప్పుడు రామలక్ష్మణుల ♦ నిచ్చినవారల నోర్తు రెంతయున్.

దశర—(తనలో) అక్కటా! యీమాట నాహృదయమునకు వజ్ర
ఘాతమువలె దగిలినదే! ఆసుకుమారులవిడచి నేనెట్లుబ్రతుకు
దును? అన్నన్నా! ప్రాణముమీదికివచ్చినదికదా! (ప్రకాశము)
సంయమీంద్రా!

సీ. సరిగజాపమునకు ♦ జ్యావల్లిగూర్పగా
బల్మిచాలని పసి ♦ వారుకారె
బాణసంధానవై భవము నెఱుంగని
చిరుతకూనలు కారె ♦ యరయవారు
లేతతమ్మిదూండ్లబో ♦ లిన భుజాదండముల్
కలవారలై తురే ♦ కఠినములకు

పిల్లలాటలయందు ♦ బ్రీతితో జరియించు
కసుగాయ లేడ ♦ రాక్షసుల దేడ

గీ. అక్కటా స్వప్నములనైన ♦ ననురరూపు
గనియెఱుంగనివారు ర ♦ క్కసులభీక
రాట్టహాసములకు భీతి ♦ నందరొక్క
పుత్రులనువీడినన్నుఁ గొం ♦ పోవుమయ్య.

విశ్వా—ఓయి దశరథమహీపాలా! నీ వందులకై శంకింపనవసరము లేదు.

చ. ఎఱుగవు వారిశక్తుల నొ ♦ కించుకయైనను రామలక్ష్మణుల్
దురమున రాక్షసాధముల ♦ ద్రుంచుట బ్రబరో! రాజచంద్రమా
వెరువకుమీవు వీరిబల ♦ విస్తృతిధైర్యము నీ వసిష్ఠుడే
యెఱుగని శక్తిలేనియెడ ♦ నేనెటుకోఁడ్కొని పోదుఁజెప్పుమా.

దశర—మహాత్మా! ఆ రాక్షసులెవ్వరు?

విశ్వా—వారు సుందునకును దాటకికిని జన్మించిన సుబాహు మారీచులను వారు రావణునిచే బంపబడినవారు.

దశర—(తనలో) అన్నన్నా ప్రాణసంకటము వచ్చినదికదా! ఏమి సేయుదును! (ప్రకాశము) భగవన్! గాధినందన!

చ. కొడుకులకై తపించి ♦ మునికుంజర! మీకృపగాంచివాఁడ నీ
బడుగుతనాన కీసుతుల ♦ వారలబాసిన నాదుప్రాణ మీ
యొడలున నిల్చునయ్య! సమ ♦ రోర్వికి నేన సమస్త సేనతో
వడిఁజనుదెంచి రక్కసుల ♦ ప్రాణములందీసి హాఖంబుగాఁజెదర్.

కావున నన్నుఁ గొంపోండు యెవరైననేమి మీకుగావలసినది యజ్ఞరక్షణముగదా!

విశ్వా—రాజా! ఆ కార్యము నీ కొడుకులవలననేకాని నీవలన నగునది కాదు.

దశర—స్వామీ! నా తలంచిన కార్యభారమును నా పసికుర్రలు మోయగల్గుదురా? ఈ మాటచే నా కధికసంతాపము కలుగుచున్నది. యెట్లన ననుగ్రహించి నా పుత్రులవిడచి నన్ను గొంపోవుడు.

విశ్వా—ఏమీ రాజా! నీకు మతిచాంచల్యమా! యేమి నీ కొడుకుల నంపెదవా లేదా! తొలుత నా విధంబుగ గోర్కె దీర్తునని యిప్పుడు మాటమాటబాడి రఘుకులమున కపకీర్తి దెచ్చెదవుగా!

దశర—స్వామీ! ఆగ్రహింపకుడు.

ఉ. రావణముఖ్యులైన యసు ♦ రప్రకరంబులు దేవదైత్యభీ
రావహులంచాసస్థల మ ♦ హారధికుల్ కదుమాయకాండ్రు, రా
రే వివరింప నాకొమరు ♦ లేద వధించుటయేడ సత్కృపా
భావముతోడ నాసుతుల ♦ బాసి ననుబ్ గొనిపొమ్ము ధీమణీ.

(నమస్కరించును)

విశ్వా—(కోపముతో) రాజా ఇంకను అదేపదమా? నా క్రోధమును మరచితివా!

చ. ఇనకులమందుబుట్టి మద ♦ భీష్టము దీర్తునటంచు జెప్పి నీ
తనయులవీడ లేననుట ♦ ధర్మమె! సూనృత వాదులన్న మీ
ఘనతరకీర్తికీకరణి ♦ గల్లవచించి ఖిలంబు సేతువే
జనపతి! గాధినందన ♦ కృశానుడు దుస్సహుడంచెరుంగవో!

కావున వేగ నీ కొమరులబంపుము అస్మదాదుల యజ్ఞ సంరక్షణము సేయజాలని మీ రాజ్యమేల? మీరేల? నిష్కారణము నా క్రోధానలంబునకు మిందుతివు కాకుము.

వశి—దశరథమహీపాలా! నీవు శంకింపవలదు. రామచంద్రుడనహాయ శూరుడు అంతియ్యేకాక యీ మహాత్ముని వెంటబంపిన సకల

శాస్త్ర రహస్యముల నేర్చి దివ్యాస్త్రములబడసి లోకరక్షణ
సమర్థులగుదురు. కావున పంపుము.

దశ—(తనలో) అన్నా! చెడివచ్చినదకదా!

ఉ. ప్రాణసమానులై తనరు ♦ రాముని లక్ష్మణుబాసి యేక్రియన్
బ్రాణమునిల్పుకొందు నటు ♦ పాపకె యుండిన గాశికుండువై
శ్వానరుడై దహించు నెటు ♦ నల్పుటకున్ మదిదోచదయ్యె, హా
మానుగ ధారుణీగగన ♦ మధ్యమునందున వ్రేలుచుంటిగా.

(ప్రకాశము) విశ్వామిత్రమునీంద్ర! అపురూపముగ గన్న బిడ్డలవిడచి యుండలేక అట్లుపల్కితి నాగ్రహింపకుడు. రామలక్ష్మణుల రప్పించి మీకర్పించెదను.

[రామలక్ష్మణులు ప్రవేశించెదరు.]

దశర—వత్సలారా! యీమహాత్ములకు నమస్కరింపుడు.

రామ—భగవన్ సంయమీంద్రులారా! మాయభివందనములు స్వీకరింపుడు.

లక్ష్మ—మహర్షులు నాప్రణామముల స్వీకరింతురుగాక!

విశ్వా—రామలక్ష్మణులారా! దీర్ఘాయుష్మంతులై భూభారహరణ సమర్థులై వర్ధిల్లుదురుగాక!

రామ-లక్ష్మ—మహాప్రసాదము.

దశ—కుమారులారా! నన్నొక్కసారి చేరరండు (కౌగలించుకొని)

చ. గుణనిధులార! పూర్వకుల ♦ కుంజరులార! మదీయ రామల
క్ష్మణ సుతులార మిమ్ములను ♦ గాధికుమారు ముఖంబుగావ

(దుఃఖించును)

రాము—తండ్రీ సంతోషమునకు మారుగ సంతాపపడియెదరేల
అందువలనమాకు గీర్తి లక్ష్మిసమాగమన మగునుగదా

లక్ష్మ—తండ్రీ! యింతమాత్రమునకింత కొండలపాటేల వేగజెప్పుడు
దశర—

సర్వణమొనరించినాముగద ♦ రా! మిముబిశ్వా ర బాసినట్టి యా
తుణములు కల్పతుల్యములు ♦ కావె! ధరించుటదెట్లు ప్రాణముల్.

రాము—జనకా! పుత్రవ్యామోహమునం జేసి మమ్ముపడువజాలక
మీారట్లు పలుకుచున్నారు. కాని నిజముగ నీముని తిలకుని వెంట
మమ్ములబంపుట మాకరచేతికి సామ్రాజ్య మందిచ్చుటయని
తలంపుడు.

గీ: ఘర్షణోపలనముగాక ♦ కనకమునకు
గురులసేవలచేగాక ♦ కొమరులకును
వన్నెయనువాసి కల్గునే ♦ వసుధలోన
గాన మునిసేవకయి జన ♦ కా! పనుపుమి.

దశ—బిడ్డా! మిమ్ము విడచియుండలేక పొగలుచుంటిని కాని మీారు
పోవుకార్యము మహత్కార్యమని యెఱుంగుదును.

లక్ష్మ—తండ్రీ! చింతిల్లకుడు. వేగ సంయమీంద్రుని కృపవడసి
వచ్చెదము.

దశ—పుత్రులారా!

సీ. సులభంబుగా ధను ♦ స్సున నారికూర్తురే
కలువతూడునులోలు ♦ కరముతోడ
చరచరమనిబాణ ♦ సమితిగూర్పగలారె
పల్లవంబననొప్పు ♦ పాణితోడ
అతిభీకరంపు మా ♦ యాకల్పనల మాయ
జేయగలారె యో ♦ చిన్నలార
భీభత్సకరదైత్య ♦ వీరులదిలకించి
జడియకుండగ రారె ♦ బుడుతలార

గీ. సమరకర్కశులైన రాక్షసులక్రతువుల
భంగపఱచుచుందురే రాయ ♦ సుంగులార
తండ్రులార! సద్గుణమణి ♦ ఖనులార
రామలక్ష్మణులార రా ♦ జసుతులార.

రాము—జనకా! ఆ విషయమై మీరేమియు సంకోచింపకుడు.

సీ. కనుమూసి తెఱచునం ♦ తనె ప్రభారాత్రి విం
టికనైన నాకేమి ♦ చింతేమయ్యా
తృటిలోన రవికాంతి ♦ మటుమాయమైపోవ
జెలగి బాణములవ ♦ ర్షింతుమయ్యా
దూటబిళ్ళలరీతి ♦ దుష్టులైతేము వ
క్త్రంబులధాత్రిపై ♦ రాల్తుమయ్యా
భీభత్సకరదైత్య ♦ వీరులరక్తముల్
చిటికెలోప్రవహింప ♦ జేతుమయ్యా

గీ. ఆకటికి నోర్వలేమని ♦ యడలకయ్య
మూలముల నెక్కలేమని ♦ మూల్గకయ్య
మఖము గావగలేమని ♦ మానకయ్య
భవ్యకౌశికమునివెంట ♦ బంపుమయ్య.

విశ్వా—బళిబళి! రామచంద్రా! సద్గుణసాంద్రా! రఘుకుల కమలాకర తరణివన నీవేనోయి నీ గుణంబులు శ్లాఘాపాత్రంబులుకదా!

లక్ష్మ—జనకా! ఇంకను శంకించుచుంటిరా?

గీ. అన్నగారికిఁగుడి భుజ ♦ మై వెలయుచు
సర్వవిధముల యజ్ఞర ♦ క్షణమునందు
దోడుపడువాఁడ గాధిపు ♦ త్రుని కరుణను
బడసెదము కాన నికబంప ♦ వలయుదండ్రి.

వశి—తథాస్తు! విశ్వామిత్రుని యనుగ్రహమునం జేసి నీ పుత్రు దివ్యాస్త్ర కోవిదులగుదురు. వేగబంపించుము.

దశ—ఓ కౌశికమునీంద్రా!

గీ. సర్వవిధముల బసివారు ♦ సకలదైత్య
వీరుల నదేవిధాన జం♦పించుకొనెదొ
నీదెభారముసుమ్మి మ ♦ నీషివర్య
అర్పణము జేసినాడ నా ♦ యాత్మజులను

(పిల్లల గాధికున కర్పించును)

విశ్వా—రాజేంద్రా! నీకు భద్రమగుగాక, నీ కుమారులు విజయ లక్ష్మీ పాణిగ్రహణ మహోత్సవ మనుభవించి అచిర కాలమున నిన్ను జేరుదురు. మేము పోయివచ్చెదము.

రామ—జనకా! పోయివచ్చెదము, వశిష్ఠమునీంద్రా! ఆశీర్వదించుడు.

లక్ష్మ—తండ్రీ! పోయివచ్చెదము ఆచార్యోత్తమా! పోయి వచ్చెదము.

దశ—శుభములు గలుగుగాక.

వశి—కళ్యాణప్రాప్తిరస్తు.

(అందరు నిష్క్రమించెదరు)



శ్రీ

# సంపూర్ణ రామాయణము

* * *

## తృతీయాంకము

### 1 వ రంగము : సరయూనదీప్రాంతము

[రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశించెదరు]

విశ్వా—రామభద్రా! ఇదియే అంగదేశమనబడునది.

రామ—మహాత్మా! అంగదేశమనుటకు హేతువెయ్యది?

విశ్వా—వత్సా! శంకరుండు పార్వతిని బెండ్లియాడనిందుదపము సేయ మన్మథుడాతని బుష్పబాణంబుల నొప్పించె నందులకై శివు డాగ్రహించి తనకంటిమంటచే మరుని యంగం బిట గాల్చుటచే నిది యంగదేశమనబడునది.

రామ—ఓహో! పుణ్యస్థల సందర్శనంబునం జేసి పవిత్రులమైతిమి కదా! స్వామీ! ఆప్రవహించుతరంగిణి నామమేదియో!

విశ్వా—రామచంద్రా! అదియే సరయూనది. అందు గృతస్నాతులై వచ్చితిరేని మీకు క్షుత్పిపాసలు లేకుండ బల, అతిబల, అను మంత్రముల నుపదేశించెదను.

రామ-లక్ష్మ—మహాప్రసాదము (యిద్దరుగృతస్నాతులై వత్తురు)

విశ్వా—(రామలక్ష్మణుల చెవిలో మంత్రముపదేశించి) రఘుకులపావనులార! మీరీ మంత్రములను మనస్సుచే జపించుచుండిన

క్షుధయు బిపాసయు గలుగవు. రెండవ మంత్ర మననమువలన దివ్యాస్త్రములు మీకుస్వాధీనించుచును,

రామ-లక్ష్మ—ధన్యోస్మి! ధన్యోస్మి!

విశ్వా—వత్సలారా! యీప్రాంతమును మలదకరూశదేశములని వాడబడుచున్నది. ఈ ప్రదేశంబునందే సుందుని భార్యయైన తాటకయను నిశాటి సుబాహు మారీచు లను పుత్రులతో స్వేచ్ఛగ సంచరించుచు నరులకు నిలయంబులకుగూడ దేరిచూడరాని దై ప్రవర్తించుచున్నది. నీవుదానిని సపుత్రకముగా వధించి యీప్రదేశమును నిష్కంటకముగ జేయుము.

తాటక—(వికృతాకారముతో ప్రవేశించి) అలలలా! అరే, దురాత్ములారా! యెవ్వరురామీరు! ప్రళయకాల భైరవింబోలిన యీగ్రంథిల్య భుకుటిలలాటను యీశోణితసిక్త పటుఖేటను యీతాటకను గాంచిన జేజవారైన మనుష్యకోటులీవనంబునం బ్రవేశింపక తొలగిపోవుచుండ ఔరా! యెంతనిర్భయముగ నావదన గహ్వర విహారమునకు గడంగినారు! రండు రండు మిమ్మందర నాకోరలచే నమలి భక్షించెదనుగాత! అలలలలా అరరేరారా (మీదికివచ్చును.)

విశ్వా—రామభద్రా! దీనిను పేక్షింపకుము. కోలచేగూల్పుము

రాము—తమ్ముడా! దీనినిపుడే నాశరమున నమవర్తికడ కంపెద జూడుమా!

శా. ఓసీ! తాటక నామధేయిని మహా ♦ హుంకార మొప్పార నా
పై సంరంభము జూపవచ్చిన భయ ♦ భ్రాంతిన్ విడంబాడ, రా
కాసీ! మామకఘోర బాణశిఖిక ♦ ద్ధంగానిమున్ జేతు రా
వే! సుత్రాముముఖాది దేవతలకున్ ♦ బ్రీతిన్ దగన్ గొల్పనే.

(బాణమువిడువ దాటకి) హాహాహా అరరా (అనికూలును.

విశ్వా—రామచంద్రా! జయము జయము. అదిగో! సురలు పూలవా
నల గురియుచున్నారు.

రామ—మహాత్ముల యనుగ్రహ ప్రభావమే. చేసల్పుదను, (శిరము
వంచును.)

విశ్వా—మరియు మీకు గొన్ని యస్త్రముల నుపదేశ మొనరించెదను.

రామ-లక్ష్మ—పాదధూళులను (శిష్యులవలెవంచి నిలుతురు)

విశ్వా—(వారికుపదేశించును) ఓ వత్సలారా! మీరీయస్త్రముల కలి
మిచే నాయజ్ఞభంగుల సంహారించుడు. నేనుపోయియజ్ఞమునకు
ప్రారంభించెదను (నిష్క్రమించును)

రామ—చిత్తము.

2 వ రంగము—యాగశాలి వనాంతరము

రామ—తమ్ముడా? లక్ష్మణా! ఆమింటివైపు చూడుమా!

గీ. కౌశికుని యజ్ఞకుండ ని ♦ ర్గతమగుచునిన
ధూమసంచయమో లేక ♦ దుష్టదనుజ
వర్గమాయరొ కొని యం ♦ బరమునందు
న సమయాంబుద సంచయం ♦ బావహిల్లె.

లక్ష్మ—అన్నయ్యా! అది హోమధూమము కాదు. తప్పక దానవ
మాయాకల్పిత కాల మేఘాడంబరమే! కావున నీవు వాయు
మార్గణంబున నీజలధర పంక్తిని దూలించుము. (ఆశ్చర్యము)
ఓహో! అపుడే రక్తవర్షము ప్రారంభించినది చూచితివా!
వేగత్వరపడుము.

రామ—(బాణమును ప్రయోగించును)

లక్ష్మ—అన్నయ్యా! అక్రేవనొక ఘోరరాక్షసుడు మింటనుండి వికృ
తాకారముతో ధరిత్రిగూలినాడు. శోణితవర్షము చల్లారినది,
మేఘపంక్తి విరిసినది.

రాము—లక్ష్మణా! సుబాహుమారీచులలో నీడొక్కడుకావచ్చును. రెండవవాడిక మనబాణమునకు గురికావలయును.

లక్ష్మ—అదిగో! అదిగో! రెండవవాడును మరికొందరునుమరలనంబర తలమాక్రమించుచున్నారు. బాణమును సంధింపుము.

రాము—కొనెను (బాణము సంధించును) తమ్ముడా! నాఅనిలాస్త్ర మానిశాటుని సముద్రమధ్యమునకు గొంపోయి పడవైచిన దోయి.

లక్ష్మ—ఇక శత్రునిశ్శేషమైనదని తలంపవలసినదే.

విశా—(ప్రవేశించి) వత్సలార! నాసవనభంగులైన సుబాహు మారీచప్రముఖులు హరించినారు. యజ్ఞము పరిసమాప్తిని బొందినది. మిథిలానగరమున జనకమహారాజు యజ్ఞమొకటి జేయుచున్నవాడు మనమచ్చటికి బోవవలయును. రండుపోవు దము.

రాము—చిత్తము

(నిష్క్రమించెదరు.)



శ్రీ

# సంపూర్ణ రామాయణము

## చతుర్థాంకము

### 1 రంగము : గౌతమాశ్రమము

[రామలక్ష్మణ విశ్వామిత్రులు ప్రవేశించెదరు.]

రామ—మహాత్మా! కౌశిక గురువర్యా!

సీ. ఆశ్రమపథముల ♦ యందు మునీంద్రులు
సంచరించిన యట్టి - జాడ లేదు
పూచినయట్టి పూ - వులు కుప్పకుప్పలు
గా రాలె గోసి ♦ న తీరు లేదు
చెట్లయాకుల ముని ♦ శ్రేష్ఠులు చేసిన
హోమపుంబొగ పర్వి ♦ యుండ లేదు
పరువుగా బెరిగిన ♦ పాలాశకుశకోన
లెంతయు గోసిన ♦ ల్లెసగ లేదు

గీ. వీనులకు నింపుగొల్పెడు ♦ వేదరవళి
యంతయు ప్రతిధ్వనింప దీ ♦ ప్రాంతభూమి
పాడువడియుండె నే ♦ మునివరుని యాశ్ర
మంబొ! తెలుపవె! కౌశిక ♦ మౌనివర్య.

విశ్వా—వత్సా! ఇదియే గౌతమాశ్రమము.

రాము—ఆర్యా! ఆ గౌతమఋషి యిందు లేడా! ఆశ్రమమిట్లుంటకు
కారణమేమి?

విశ్వా—అయంశమునే తరువాత జెప్పెద.

రాము—ఓహో! ఈశిల మార్గమునకు నిరోధమైనదే. అంతలిరాతిని తన్నును. అహల్య స్త్రీరూపముతో ప్రవేశించును.)

రాము—ఏమి! యీ ఆశ్చర్యము ఈ శిల స్త్రీ యెట్లయ్యె?(ఆశ్చర్య మభినయించును )

అహల్య—(ప్రవేశించి) మహానుభావా! రామచంద్రా! పురాణపురుషా

ఉ: ఈవె సమస్తలోకముల ♦ కీశుడవో రఘురామచంద్ర! నీ
పావన పాదధూళి నిల ♦ వంబడసోకగ శప్తనైన నా
గ్రావపురూపు బాసి యల ♦ గౌతమపత్ని నహల్యనైతి నో
దేవ! పవిత్రనైతి బ్రణు ♦ తించెదనన్ను ననుగ్రహింపుమా.

స్వామీ! నీవు జగద్రక్షణార్థంబు దుష్టసంహారము సేయ నవతరించిన ఆదినారాయణుండవు, పరాత్పరుడవు. నీసందర్శనమునకై చిరకాలమునుండి శిలనై తపించుచు నేను నీదర్శనపదస్పర్శ మున బవిత్రురాలనైతిని.

రాము—అమ్మా! నీకు శాపమొసంగిన వారెవ్వరు? నీ వొనరించిన యపచారమేమి?

అహల్య—(తలవంచి యూరకొనును)

విశ్వా—రామచంద్రా! యింద్రుండు కామాతురుండై యర్ధరాత్రమున గౌతముని పంచ కోడియై కూసెను. తెల్లవారెనని గౌతముడు స్నానార్థమై నదికేగెను. అంతట వజ్రి గౌతమవేషమునన హల్యను స్పృశించెను. తరువాత నెంతకును దెల్లవారలేదని ముని జ్ఞానదృష్టిచేజూడ నింద్రుని దుష్కృత్యము తెల్లమయ్యె. వెంటనేవచ్చి ఓరీ శతమఖా! భగలోలుడవై వంచించితివి. కావున సహస్రభగుడవు కమ్మని శపించి పాషాణరూపము నొందుమని

యహల్యను శపించెను. అప్పుడు దేవప్రార్థనచే నింద్రుని సహ స్రాక్షునిగ నుండుమని యనుగ్రహించెను.

రాము—ఆహా! కామాంధకారము శతమఖుఁడంతవానిచేఁ గోడివేష మును వేయించినదే! అమ్మా! యెంతకఠినము చేసిన నిన్నేల శపి యించెను!

అహల్య—మహానుభావా! నేనెంతో మొఱపెట్టి ప్రార్థించి శాప విమోచన క్రమము నెఱింగింపుమన నారాయణుండు రామావ తారమెత్తి మిథిలకుఁబోవుచు నీమార్గమున వచ్చినపుడు నంటు సోకించినప్పుడు నీశాపవిమోచనము కలదని చెప్పి తాను హిమ వంతంబునకుఁబోయె నది మొదలు నేను మీదర్శనమునకై వేచి యుండి నేఁడు ధన్యురాలనైతిని. నేను నాథ సన్నిధికిఁబోయె దను. మీకివే నమస్కారములు.

రాము—తల్లీ! నీ సందర్శనమున ధన్యులమైతిమి. నీవరుగుము.

అహల్య—మహాప్రసాదము.

విశ్వా—రామభద్రా! మనమింక మిథిలకుఁ బోవుదము రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

---

2 వ రంగము : సభాభవనము

[జనక శతానందులు ప్రవేశము.]

జనక—గురుపుత్రా! శతానందా! ఏమంటివి? సీతాస్వయంవర విష యమై శివధనురారోపణంబు పణంబుగా నేర్పరచుట దుర్ఘట కార్యమనియా మీతలంపు! అట్లు కాక యేమి సేయుమనెదవు?

ఆ. వె. బాలతుకలను గూడి ♦ బొమ్మల పెండ్లిండ్లు
చేయువేళ నడుమ ♦ చేతిలోడ

వేయిమందిమైన ♦ మాయజాలని శివ
వింటిలీల నెత్తి ♦ బెట్టె నవల.
అట్టిభుజబలోపేతకు దగిన భర్త యగు శివచాపము నెక్కిడిన
వాడేకదా యని యట్లు నిర్ణయించితిని.
శతా—ఓహో! అలాగునా ? నేనదియెఱుంగక అట్టి వరుడు సంభవిం
చుట దుర్ఘటమని అట్లంటిని.
[విశ్వామిత్ర రామలక్ష్మణులు ప్రవేశించెదరు]
అందరు—(లేచి ప్రత్యుత్థానమును సేయుదురు.)
జనక—విశ్వామిత్ర మునీంద్రా! నావందనముల స్వీకరించి యిందు
దయసేయుడు. బాలకులారా! మీరును యీపీఠములనలంక
రించుడు.
విశ్వా—ఓవిదేహరాజ చక్రవర్తీ! చింతిత కళ్యాణసిద్ధిరస్తు. కూరు
చుండుము.
జనక—(కూర్చుని) సంయమీంద్రా! యీసుందరాకారు లెవ్వరు?
విశ్వా—జనకమహీపాలా! అదియే చెప్పెద నాకర్ణింపుము.
సీ. రఘువంశమున దశ ♦ రథ రాజపుత్రులు
రామలక్ష్మణుల పే ♦ ర్వడసినారు
రాముడితండు మా ♦ ర్గంబున నొకకోల
దాటకియనెడు ని ♦ శాటిద్రుంచె
నాయజ్ఞమునకు వి ♦ ఘ్నంబుజేసెడు సుబా
హ్వాదుల దునుమాడి ♦ యలరినాడు
చరణ ధూళీల న ♦ స్పర్శచేతను శాప
శిల నహల్యనుజేసి ♦ చెలగినాడు
గీ. విడప నీయింట త్రిపురారి ♦ వింటినెక్కు
పెట్టి మీపుత్రిసీతను ♦ బెండ్లియాడ
వచ్చియున్నాడు దేవతల్ ♦ మెచ్చునటుల
వేగ శివచాపమిటకు దె ♦ ప్పింపుమయ్య.

శతా—ఓహో! నాతల్లియైన యహల్యాదేవి శాపమును బాపిన మహాత్ముడా! భగవన్ రామచంద్ర! మీపవిత్ర చరణారవిందములకనేకవందనములు (నమస్కరించును)

రాము—అయ్యా! అహల్యాకుమారా! ఔను నీవే మాకు వందనీయుడవుకదా!

జనక—ఓహోహో! ఏమి నాపుణ్యము! ఏమి నాభాగ్యము! గాధేయమునీంద్రా!

ఉ. కేవల పావనుండయిన ♦ కేశవుడే యగుగాని లేనిచో
నావిధిశప్తమైన శిల ♦ సంఘ్రిసరోజంబున బాతకంబులన్
బోవగజేయునే పురుష ♦ పుంగవు మానవుడంచు నెంతు మే
దైవము నాదు పూర్వసుకృ ♦ తంబున నీగతివచ్చె సీతకై.

విశ్వా—అందులకు సందియమేమి? కేవల పరాత్పరుడనియే యెంచ దగును.

జనక—శతానంద! నీవుపోయి శివచాపమును దెప్పించుమని సేనానికిని సీతను దోడ్కొనిరమ్మని చెలులకును నాఆజ్ఞగాదెల్పుము.

శతా—చిత్తము. (నిష్క్రమించును)

[సీతా నందినులు ప్రవేశించెదరు]

నందిని—అమ్మా జానకీ! రారా! యిటు యిటు.

సీత—(సిగ్గుచే తల వంచును.)

నంది—ఓహో! నీవిప్పుడే వరింపబడితివా!

సీత—(కోరచూపుతో) ఓసీ! ఎవరి చేతనే?

నంది—ఎవరిచేతనా! యిపుడు సిగ్గుచేత.

సీత—తరువాత!

నంది—తరువాత శ్రీరామచంద్రునిచే.

సీత—నందినీ! యీ సందిగ్ధసమయమున బరిహాసింపకుమా. (పైట చెరగు దుడిచికొనుచు)

నంది—సీతా! నేను వ్యర్థముగ బరిహాసించుటలేదు. శ్రీరామచంద్రుని ప్రేషణ పుష్పమాలికల నపరించుకొనుచున్నావు. అవి నిరంతరము నీ కంఠము నలంకరించియే యుండునుగాని పోవునవికావు సుమీ.

సీత—(రాముని వంక జూచును)

నంది—అదిగో రామచంద్రుడును నీ చూడ్కులనెడు నల్లకల్వల దండను కంధరమున నలంకరించినాడు. అప్పుడే యెంత మురియు చుంటివే!

సీత—(అంగుళిచే బెదరించి) నీ యసంబద్ధ ప్రలాపము లిక మానుమా.

రాము—(తనలో) ఆహా! యీజానకీ సౌందర్య మెంత మోహనాకారముగ నున్నది.

మ. బళిరా! యీజనకాత్మజాత ఘనబా ♦ వణ్యాంబుపూరంబులో
పల బాహుద్వయియుగ్మతూకులుగ ♦ శైవాలంబుగాగొప్పనున్
జలజంబట్టుల మోము నేత్రములు చం ♦ చన్మీనయుగ్మం బనా
నలరెన్ జన్నులు చిమ్మెమెగ్గలన మో ♦ హాకారతన్ మించెడిన్.

ఓహోదైవమా! యీ పురంధ్రీరత్నమును నాకు నమకూర్చుమా! (భటులు శివచాపమును మోసితెత్తురు)

జనకు—రామచంద్రా!

తే. గీ. ఈ శివశరాసనవరంబు ♦ నెవ్వడత్ర
మమున నెక్కిడు నాగుణ ♦ మండనునకు
నాదుపుత్రిక సీత న ♦ న్మానపూర్వ
కంబుగ నొసంగువాడ లో ♦ కంబుమెచ్చ.

కావున నీ వీ శివకార్ముకము నెక్కుపెట్టి నా మనోరథము నీడేర్పుము.

విశ్వా—వత్సా! రామభద్రా! వేగ మారోపించుము.

రాము—గురువర్యా! అభివాదనము సేయుచున్నవాఁడ.

విశ్వా—ఆయుష్మంతా! త్రిశంకుసుత నిపి హరచాపము నెక్కు
    పెట్టెదవుగాక.

రాము—(ధనుస్సునకు నమస్కరించి)

గీ. త్రిపురదానవులను గూల్చి ♦ జేనదేవ
దైన శివునకు జయమిచ్చి ♦ నట్టిచాప
రాజమా? జానకీ పతి ♦ ప్రణామమునకు
గారణమ! నీకు వానను ♦ స్కారమంలివె.

(ప్రదక్షిణ నమస్కారములు చేసి చాపము నెత్తి)

గీ. గురువశిష్ఠుల కౌశికు ♦ గురుతరంపు
భక్తి గొల్చితి సేవియా ♦ భవునివిల్లు
నక్రమంబున నెక్కిడి యభి ♦ మతెంబు
నందువాఁడను జనకు లా ♦ నంద మొంద.

(ఎక్కుపెట్టగా ధ్వనితో విరుగును)

సీత—హా నందినీ (చేటికను కౌగలించుకొనును)

నంది—జానకీ జడియకుము. నీ యభీష్టలత పుష్పించినది. నీ మనో
    హరుండు రామచంద్రుండు శివవిల్లు నెక్కుపెట్ట నాతని
    బాహుబలమునకు జాలక విరిగిపోవుటచే గలిగినధ్వని కాని
    యిప్పుడే యుపద్రవమును రాలేదు. కన్నులదెరచి నన్ను
    విడచి శ్రీ రామచంద్రుని గాగలించుకొనుము.

సీత—(నందిని బుగ్గలు నులుమును)

జనకు—అమ్మాయీ సీతా! యీ పుష్పహారమును శ్రీరామ
    చంద్రుని కంఠమున నలంకరించుము. (పూలదండ యిచ్చును)

శతా—రామచంద్రా! సీకీ పూలదండను జానకీదేవి గళమున నలంకరింపుము (దండయిచ్చును)

సీత—(రామునకు దండ వేయును)

రాము—(సీత మెడలో పూలదండ వేయును)

విశ్వా—సమస్త సన్మంగళానిభవంతు. (అక్షతలు చల్లును)

జనకు—కౌశికమునీంద్రా! భవదీయ కరుణారసంబునం జేసి ధన్యుండనైతిని. త్రిలోకపూజ్యుడు జామాత యైనందుల కమితానంద మందితిని. మరియు నీ లక్ష్మణునకు మా యూర్మిళను కైకేయీ పుత్రులైన భరత శత్రుఘ్నులకు మాండవీ శ్రుతకీర్తుల నొసంగి వివాహము సేయఁదలంచితిని. మీరు దశరథమహారాజుగారితో విన్నవించి యీ శుభముల జరిగించ గలందులకు ప్రార్థిస్తున్నాను.

విశ్వా—జనకమహీపాల! తథాస్తు. అటులే సంధానము చేసెదను.

(అందరు నిష్క్రమించెదరు)

---

3 వ రంగము : కల్యాణమంటపము

[ దశరథ జనక విశ్వామిత్ర రామలక్ష్మణులు ప్రవేశించెదరు ]

జనకు—విశ్వామిత్రమునీంద్ర! భవదీయ కృపాకటాక్షమునం జేసి రాజకులచంద్రుడైన దశరథమహారాజుతో వియ్యమందితిని. మహాపురుషులు జామాతలైనవారు. మీకు సహస్రవందనములు కాక వేరేయుపకారము సేయజాలను.

(నమస్కరించును)

( తెర లో )

అరే అరే క్షత్రియకుల పశువులారా! నా దృష్టిపథమునుండి యువ్వళక్షు ధ్వాళగిపొండు

విశ్వా—ఓహో! రాజకుమారక గ్రహామైన పరశురాముడు కాబోలు నిటు వచ్చుచున్నాడు. కానీ; మంచి సమయమునకే వచ్చినాడు.

జనకు—కౌశికమునీంద్రా! అక్కటా మా కపాయముకదా!

విశ్వా—భయము లేదు; మీరందరు నిర్భీతిగ గూర్చుండుడు.

పరశురాముడు—(ప్రవేశించి) అరే క్షత్రియ పశువులారా!

మ. అవనీనాథ కుమారక కంధరస ము ♦ ద్యద్రక్తధారాభిషే
కవిశేషోగ్రకుఠారధార నెఱుగం ♦ గాలేదె యీమత్తభూ
ధవ సంతానవిశృంగముల్ మొలిచెనే ♦ తథ్యంబుగా మీకునే
డవురా నన్గని మూలలం దడగరా ♦ హా! యెంత ఆశ్చర్యమో!

సరే కానిమ్ము మదీయక్రోధోద్దీప్త నిశ్వాసమారుతమును వెల్వరించి యీ రాజకుల కాంతారమున కుత్పాత ఝంఝానిలమును బుట్టించెదనుగాక. ఓరోరి రాజులారా!

ఉ. భార్గవ రామనామమును ♦ స్వప్నమునందుననైన విన్న స్త్రీ
వర్గములోన దూరియుతి ♦ పల్వలెగాజుల దాల్పరే! భయో
త్సర్గులరౌచు నేడు నను ♦ డంబున నన్గనియుం జలింపరే
భర్గసమానుడైన బల ♦ వంతు డెవం డిట సాయమయ్యెడిన్.

సరే తెలిసినది ఓరీ దశరథా! యీకుమారులెవ్వరు?

దశ—స్వామీ! వందనములు. వీరు నాపుత్రులు రామలక్ష్మణు లను వారు.

పరశు—ఏమీ! రాముడన నేనొకడనుండ నాకు ప్రతిరాముడొకడు వెలసెనుగా!

దశ—జమదగ్నికుమారా! ఆగ్రహింపకేము. మీ నామము బెట్టిన శ్రేయంబని అట్లుంచితిమి. అంతియె కాని వేరు లేదు.

పరశు—ఓహో! కడుయుక్తిగ సమర్థించితివే! సరే, అది యటుండ నిమ్ము ఓరీ దశరథరామా!

సీ. కార్తవీర్యార్జున భుజోగ్ర ♦ కాననమును
ద్రుంచి తద్రక్తపూరవా ♦ ర్ధులనుస్నాన
మాచరించిన మత్కుఠా ♦ రాంచలంపు
బటిమ నెఱుగుదువే? రఘు ♦ వంశపుత్ర!

రాము—భార్గవరామ! చెప్పగా వినియున్నాను. కాని నీవు చెప్పవల సిన దేదో చెప్పుము.

పర—ఏమీ! యీ తిరస్కారము! అటులైన వినుము

ఉ. కాతకుఠారధార నృప ♦ సంతతినిర్వ్యది రొక్కమారు ని
ర్భీతిగ ద్రుంచి తద్రుధిర ♦ విస్తృతిచే బితృదర్పణంబు సం
ప్రీతిగ జేసినట్టి భృగు ♦ వీరుని రాముని దోఃప్రతాపవి
ఖ్యాతి నెఱుంగరే నృపుల ♦ హా తల కెక్కెనే! నేడు నేత్రముల్.

రాము—భార్గవా! ధరణీశుల కన్నులు తలకెక్క లేదు గాని నీ కన్నులు తలకెక్కినవి.

పర—హా హా! ఎందుచేతరా!

రాము—ఎందుచేతనా!

ఉ. ఊర్జితమూర్తి నీజనకు ♦ నూరక చంపుటచేత గార్తవీ
ర్యార్జుని మీద గోపమున ♦ నల్లనవాని వధింపవచ్చు జ్ఞా
నార్జన లేక యీనృపుల ♦ నందఱిపై బగబూని వీరలన్
భర్జన సేయబూనుట ధృ ♦ వంబుగ నీ తల కెక్కె నేత్రముల్.

పర—ఔరా డింభకా! ఏమిరా కండక్రొవ్వు.

విశ్వా—భార్గవ రామా! సత్యము పలికిన నీ శ్రీరామునిపై నేల యాగ్రహించెదవు? ఈతడు పాదధూళిచే శిలయైన యహల్య . శాపవిమోచన మొనరించిన పరమపురుషుడు, శివచాపము విఱ్ఱ

పెట్టి సీతను పరిగ్రహించిన పరాక్రమధనుఁడు. అట్టిరాముని నీవు అల్పునిగ దలంప తగదు రామ.

పరశు—ఏమీ విశ్వామిత్రా! బ్రహ్మర్షివైన పరిపక్వమైన సమయమున కీరాముఁడక్కటికి పోయియుండనోపు అంతమాత్రమున సీతను ఘనుఁ డెట్లయ్యె నీవిట్లు మెచ్చుకొనుచు విదేలా యీరాజాలింత నిర్భయముగనున్నాఁడు. సరేయగుఁగాక. ఈరాముఁడిప్పుడు నాకు శత్రువుడైనాఁడు. యేమందువా! నాగురుండైన శివుని విల్లెక్కుపెట్టజాలక విరిచుటచేత ఓరీ దశరధరామా!

చ. యుగములు పెల్లగాజెడికి ♦ యెక్కిడియున్న పురారిచాపమున్
బగులగ జేయగానె నొక ♦ పౌరుషమే రఘువంశపుత్ర! యీ
భృగుకులరాము చాపమును ♦ నీపయినైనను నెక్కుపెట్టినన్
జగములు నిన్ను రాముఁడను ♦ జంకిన భార్గవదాసుఁడందు వే.

రాము—ఏమీ భార్గవా! అలాగునా!

శా. ఏదీ! యిచ్చదియొక్క మారవనిబ్బ ♦ ధీశౌవళి భ్రమించి, మ
ర్యాదన్ గొన్న త్వదీయ కార్ముకము గొం ♦ డ్లారంగ వీక్షింతు—
(చేతిలో ధనువులాగికొని) నా
హా! దుస్సాధ్యమె దీని నెక్కిడుట రామా! ♦ చూచెదాగాకని
నాదర్పంబుల పెంపు మద్గురుజనా ♦ నందంబు వాటిల్లగన్.

(ధనుస్సు నెక్కిడి బాణము సంధించును)

పర—(ఆశ్చర్య విభ్రమములతో) అహా! ఆశ్చర్యముగనున్నదే!

గీ. ధనువుతోడనె నాశక్తి ♦ దస్కరించె
సీతఁ జెండ్లాడె మది ♦ యొంటుకఁబడదు
శ్రీరమేశుని యవతార ♦ తారమనుచు
దలపవలె లేకయున్న నీ ♦ దర్పమేడ,
అయిన గొంతవడి కాలోచించెదను.

రామ—భార్గవరామా ! నీచాపము నెక్కు పెట్టితి నీ బాణము నెచ్చట విడువవలయునో చెప్పుము. యేమందు వేని?

సీ. అస్మదాచార్యుడౌ కశి ♦ కాత్మజునకు
బాంధవుండవు మఱియును ♦ బ్రాహ్మణుండ
వగుట నినుజంప నీ యమో ♦ ఘాస్త్రమెచట
విడువవలయునొ ! చెప్పుమి ♦ వేగనాకు.

పరశు—రామమూర్తీ ! నీయిచ్ఛయున్నచోట విడువుము.

రామ—భార్గవా ! నీనిమిత్త మెక్కు పెట్టిన వైష్ణవబాణము నట్లువిడువరాదు. నీపాదగమనశక్తినిగాని నీచిరతపస్సంపాదితమైన పుణ్యలోకప్రాపణశక్తినిగాని త్రుంపవలయును, ఇందు దేనిని భంజింపు మనెదవో చెప్పుము.

పరశు—రామచంద్రా ! నాపుణ్యలోకమును ఛేదించుము.

రామ—(బాణమును ప్రయోగించును)

పరశు—(చూచి) ఆశ్చర్యమాశ్చర్యము. ఆహాదేవా ! ఆదినారాయణా లక్ష్మీకళత్రా ! (నమస్కారముతో)

గీ. తెల్లమై మీనిజస్థితిఁ ♦ దెలిసికొంటి
భూభరము మాన్పనరుడవై ♦ పుట్టినట్టి
విష్ణుదేవుడ వీవుకా ♦ వేమహాత్మ
రక్షణము సేయుమయ్య శ్రీ ♦ రామచంద్ర.

స్వామీ! పురాణపురుషుండవై నీకు నేనోడుట లెక్కలోనిది కాదు. దురహంకారవశుండనై నిన్ను నిరాకరించిననాపచారమును మన్నింపుము. నీ వవతరించువరకే నాప్రభావముకాని తరువాత నే నీప్రదేశమున నుండరాదు. నాకు శలవొసంగితివేని సముద్రమధ్యమునకుబోయి తపోనిష్ఠతోనుండెదను.

రామ—భార్గవరామా ! మంచిది అటులేపొమ్ము,

పరశు—మహాప్రసాదము.

(నిష్క్రమించును)

దశర—ఆహా! యిప్పటికిగదా! పులితోటి మాంసశకలములవలె బయలుపడితిమి.

జన—ఇంతకును నా యదృష్టము మంచిది. రఘూనాథుడల్లుడై రాచకులమునకున్న యాపద నివారణచేసినాడు.

విశ్వా—అందుకు సందియమేమి? యీ దశరథాదుల సహోద్యోగకు సంపూర్ణము లెందు.

(అందరు నిష్క్రమించెదరు)





# సంపూర్ణ రామాయణము

## పంచమాంకము

### 1 వ రంగము : పుష్పవన ముఖద్వారము

[ మంథర ప్రవేశించును ]

మంథర—ధరణీతలంబున దాస్యవృత్తి కడుదుర్భరమైనదే కాని నా దాస్య మట్టిది కాదు. నేను అధిపులకంటె నధికురాలను; ఏమం దురా! మా కైకేయీదేవికి నేను పుట్టినయింటి దాసి నగుటచే నా చెప్పినట్లు కైకేయి వినుచుండును. ఆమె యెట్లు చెప్పిన నదే ప్రకార మడుగుదాటక దశరథ మహారాజుగారు వర్తించును. అందుచే నయోధ్యాపుర సామ్రాజ్యమంతయు నా చిటికెనవ్రేలి గోటిపై నల్లాడుచుండును. కావున జన్మ యన నాదే జన్మకాని యితరులు నాకు సాటివత్తురా! యిప్పు డీ యుద్యానవనమందలి పుష్పములను గోసికొనిపోయి మా దేవికి మనఃప్రియము గావించెదగాక!

వనపాలకుడు—(పూలగంపతో ప్రవేశించును)

మంథర—ఓరీ! పుష్పము లెక్కడికిరా కొంపోవుచున్నావు?

వనపా—(కోపముతో జూచి) పట్టణాలంకారమునకు.

మంథర—ఇప్పుడు పట్టణాలంకార మేమిరా!

వనపా—అదిగో పలుసార్లు ఓరీయని పిలుచుచున్నావు. నీయంత ఘనవు నీవు. నా అంతవాడను నేను. నీ వమ్మగారి దాసివి,

నే నయ్యగారి దాసుడను, ఇప్పటికి క్షమించితి నింకెప్పుడు నన్ను నోరీయని పిలువకుము

మంథ—ఏమిరా! అపోగండ! మా దేవితో జెప్పిన నిన్నేమి చేయించె దనో చూడుము

వన—ఓసీ! మా అయ్యతో జెప్పి నిన్నేమి చేయించెదనో చూడుము.

మంథ—పండ్లు రాలగొట్టెదను సుమీ!

వన—లెంపలు వాయగొట్టెదను సుమీ!

మంథ—ఓరి కుంకా! నీకెంత కావరమురా?

వన—ఓసి లంజా! నీకెంత మదమే?

మంథ—(తనలో) కడవయంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువన్నట్లు మగవెధవకు నేను చాలని మాట నిజమే. వీనిని శాంతము చే లోంగదీసి తరువాత వీని భరతము పట్టెదను. (ప్రకాశము) వనపాలక! నిన్ను నే నోరీయన్నందులకు నీవు నన్నోసీయని బదులు దీర్చితివి మన మిద్దరి గతి నిక మరచిపోవుదము కాని పట్టణాలంకారమునకు హేతువేదియో చెప్పుమా!

వన—అల్లు తిన్నగ మాట్లాడిన జక్కగ జెప్పక పోవుదునా? రేపటి దినమున పట్టాభిషేకము.

మంథ—ఎవ్వరికి?

వన—రామచంద్రమూర్తిగారికి,

మంథ—ఏమీ రామునకు పట్టాభిషేకమా! రేపే?

వన—అవును యెన్నిసార్లు చెప్పుమనెదవు రేపే రామమూర్తికి బట్టాభిషేకము.

మంథ—అలాగునా! సరే నీవు పొమ్ము.

వన—పోవక నీవుండుమని ప్రతిమాలిన నుందునను కొంటివా? (నిష్క్రమించును)

మంథ—ఈవార్త నాకాశ్చర్యముగ నున్నదే. మా దేవికుమారుల్లు భరతశత్రుఘ్నులూరలేని సమయమున రామునికి పట్టాభిషేకము సేయ నిర్ణయించుట వృద్ధరాజేదో కపటోపాయము తలంచెనని యూహించితిని. మా దేవిగారికి కార్యానుసంధలి కపటము నెఱింగించి తంత్రములనుబన్ని రామునకు రాజ్యపట్టాభిషేకము కాకుండ జేసి యావద్రాజ్యపదవిని భరతునకిచ్చునట్లు చేసెదను. అట్లు సేయకున్న నా పేరు మంథర కాదు. మంథర యన యేమో అనుకొనుచున్నారు కాబోలును. మంథరనగరంబు పాలసంద్రము నెట్లు మథించునో నేను తంత్రములబన్నిన వారిహృదయములట్లు అల్లకల్లోలముగ కలంగిపోవును. ఔరా! మా కైకేయి పుత్రునకుగాక రామునకు రాజ్యపట్టాభిషేకమా! నా ప్రభావమును లోకమంతా విలోకించుగాక!

(నిష్క్రమించును)

౨ వ రంగము—కైకేయి మందిరము

[కైకేయి శయనించి ప్రవేశించును]

మంథర—(ప్రవేశించి) అమ్మా కైకేయీ దేవీ! నిద్రించుచుంటివా!

కైక—(లేచి) మంథరా! వచ్చితివా! యిప్పుడే పండుకొంటిని, అంతలోనే నిద్రపట్టినదే,

మంథ—అహహా! (నవ్వి) బాగుబాగు,

కైక—ఏమే అట్లు నవ్వుచున్నావు. కారణమేమే?

మంథర—ఏమియు లేదు. నీకు నిద్రయెట్లు పట్టుచున్నదో అని నవ్వు వచ్చుచున్నది.

కైక—నిర్విచారము గలదానికి నిద్రసుఖముగ బట్టకమానునా! నవ్వనేల!

మంథ—ఓహో! నీకు నిర్విచారమా?

కైక—అదేమే అట్లుపలెకెదవు?

మంథర—ముందున్న ముసుళ్ళపండుగ దలంపక నిర్విచారమనుటచే నాకు నవ్వువచ్చుచున్నది.

కైక—ఏమే! ఆముసళ్ళపండుగయేదే?

మంథర—ఏదియా? దాస్యము.

కైక—దాస్యమెవరికే?

మంథర—ఎవరికో అయిన నాకీబాధయేల! నీకే!

కైక—నాకుదాస్యమేమే! ఎవరికిసేయవలయును?

మంథర—ఎవరికా! కౌసల్యకు నీవేసేయవలయును.

కైక—కౌసల్యకేమి నేనుదాస్యము సేయుటేమే!

మంథ—అలాగునా! రామునకురాజ్యపట్టాభిషేకమగుచుండగా రాజమాతకు కౌసల్యకు నీవుదాస్యము సేయవలదా!

కైక—ఏమీ! మారామచంద్రునకు రాజ్యపట్టాభిషేకమా! అహా! ఎంతచల్లనిమాట చెప్పితివే! మంచిది యొప్పును!

మంథ—(పలుకకుండును)

కైక—ఏమే పలుకవు!

మంథర—(తనలో) రామునన్న నీమెకెంత ప్రియమో! నామంత్రాంగము సాగు టెట్లోకదా! అయిన బురెక్కించెదను. (ప్రకాశము) యొప్పుడైననేమి? నీతలమీద దాస్యదేవత అధిష్టించుటకేపే.

కైక—నీవట్లుతలంచితివి కాని నాకట్టి యమర్యాద జరుగదుసుమా!

మంథ—చాలుచాలు. తెల్లనివన్నియు పాలనియు నల్లనివన్నియునీళ్ళనియు తలంచు నమాయకురాలవు. అట్లు గాక యెట్లు తలంచెదవు. ఆవృద్ధరాజు కపటోపాయ మెరుంగని గోలవు. యిన్ని

మాటలేల నీ కుమారులు భరతాదులు మాతుల గృహమున కేగ జూచి రామునకు రాజ్యమర్పించుట నీ తలమీద బుఱ్ఱ లను బూజించుట కనుగొంటివా! బొగ్గులను బోయుట కను గొంటివా! భరతాదులున్న సమ్మానింపరనియు సర్వరాజ్యమును రామున కర్పింపవలెననియు నీ మిథ్యాప్రియభర్త యిట్లేర్పర చినాడు. యిప్పుడైన గొంచెము తెలివితెచ్చుకొని నీ కొడుకు నకు రాజ్యము వచ్చు నుపాయ మాలోచింపుము. లేకున్న నీవు కౌసల్య పాదసేవ జేయవలసినదే. ఆ విషయమున నీకభి మానము లేకున్న నేనుమాత్రము నీ పాదసేవ సేయజాల. నేను చిరకాలమునుండియు కేకయ రాజకులమున మర్యాదగ బ్రవ ర్తించినాను. అందుచే నా కభిమానముగ దోచినది. యిపు డైన నీ మగడు పన్నిన మాయాతెర ఆవలకు దొలగించి నీ కొడుకునకు రాజ్యము వచ్చునట్లు చేసికొనుము. యిప్పుడు నామాట వినకున్న కౌసల్య సేవ సేయునాడైన నామాటలు నీకు రుచింపకపోవు. ఆపైన నీయదృష్టము.

కైక—(తనలో) ఓహో! యీమంథర చెప్పినమాట సత్యముగనే తోచుచున్నది. లేకున్న భరతాదు లింట లేకున్న నీ ఘనకార్య మును నాభర్త తలపెట్టునా! యిందులకుపాయమేదో మంథ రనే యడిగెదనుగాక. (ప్రకాశము) మంథరా! అటులైన నన్నిప్పుడేమి సేయుమనెదవు?

మంథర—నీకు తిక్క తిరిగిన నుపాయము చెప్పెదను.

కైక—తిరిగినది నీవు చెప్పినట్లు చేసెదను.

మంథర—అటులైన జెప్పెదవినుము. శంబర యుద్ధమున నీభర్త నీకు రెండువరంబు లొసంగి యున్నాడని చెప్పితివికదా! వాటి నిప్పుడడిగి పుచ్చుకొనుము.

కైక—ఔ నప్పుడా వరములను నాయిష్టము వచ్చినప్పు డడిగెద
నని చెప్పియుంటిని.

మంథ—అట్టులైన భరతునకు యౌవరాజ్య పట్టాభిషేకమును
రామునకు బదునాల్గేడు లరణ్యవాసమును యేర్పరచుడని
రెండు వరములను కోరుము.

కైక—అక్కటా! రాముని కరణ్యవాస మెట్లు కోరుదునే?

మంథ—అట్లు సేయకున్న ననేకాపాయములు తటస్థించును. నా
మాట వినుము.

కైక—మంథరా! మంచిమాట చెప్పితివే అదుగో నా నాథుండు
వచ్చుచున్నట్లున్నది. నీవావలకు దొలంగుము, ఆరెండువరం
బుల నడిగి బడసెదను.

మంథ—మంచిది, పప్పులో నడుగు వేయకుమా! బహు భద్రము.

కైక—నా నాథుఁడు వచ్చువర కలంకారశూన్యనై దైన్యదశతో
నుండెదను. (అట్లు సేయును)

దశరథుడు—(ప్రవేశించి) ఏమి చెప్పుదుమా కైకమందిరము నేడింత
శోభావిహీనమై యున్నది!

సీ. కనకయాంత్రిక భంజి ♦ కలు చేతులను సాచి
యెంతయు స్వాగతం ♦ బీయవయ్యె
ముంగిట మంథర ♦ ముదమూరగా నిల్చి
యుచితక్రియల బాద్య ♦ మొసగదయ్యె
వచ్చితిరాయని ♦ హెచ్చినముదమున
జెలి కైక యెదురు ♦ వేంచేయదయ్యె
ప్రతిభసర్వము వీడి ♦ బద్ధకవాటమై
నిలయుంబు కనులింపు ♦ నింపదయ్యె

గీ. మనసు స్వస్థత లేదేమొ ॥ మగువ కైక
కే విచారము కాని యీ ॥ యెడలనిట్లు
మంగళ విహీనమైన యీ ॥ మందిరంబు
గాంచినంతనె నామది కంపమెత్తె.

అయిన సమీపించి కనుగొందును గాక, (సమీపించి) ఇదిగో యిక్కడ నలంకారశూన్యయై శయనించియున్నది. కారణమేమి చెప్పుమా! ప్రియురాల! కేకయరాజనందని! కైక! ఆవిధంబుగ సొబగుదూలి విచారముతో నుంటివేమి!

కైక—(లేచి) ఓహో విచారమేమనియా! పాపము మీకు దెలియదు కాబోలును. మీ ప్రియురాలు కైక కాదు—కౌసల్య. ఆమె కడకే పొండు.

దశర—ఏమీ! నీవు మాత్రము ప్రియురాలవు కావా! యీనాడేల యిట్టి యాగ్రహావేశముతో నుంటివి దేవీ?

కైక—నేనే ప్రియురాలనైన నన్నింత చిన్నచూపు జూతురా!

దశర—నిన్నేమి చిన్నచూపు చూచితిని?

కైక—చూడకయేయున్న నేనాటి శంబరయుద్ధము యేనాటి. వరములు! యిప్పటికైన నీయగల్గితిరా?

దశర—వెర్రిదానా! అందులకా యీచింత. అవసరమున్నప్పుడడిగెదనని నీవు చెప్పలేదా! ఇప్పుడడుగుమిచ్చెదను

కైక—అటులైన తప్పక యిప్పుడిచ్చెదరా?

దశర—ఆ తప్పక యిచ్చెదను.

కైక—ముమ్మాటికి నిచ్చెదనని నాచేతిలో జేయివేయుడు.

దశర—ఆ తప్పక వేయిసారులకు నిచ్చెదను.

కైక—అటులైన భరతునకు యౌవరాజ్య పట్టాభిషేక మొకటి; రెండవది రామునకు బదునాల్గేడు లరణ్యావాసము.

దశర—హా! మందభాగ్యుడను కదా! దేవీ!

గీ. ఆత్మసుతునకు యౌవరా ♦ జ్యంబు గోర
వచ్చు నా వరమేసియు ♦ వచ్చుగాని
రాము బదునాలుగేడు ల ♦ రణ్యమునకు
బంపుమని కోరదగునె యు ♦ ప్రాజ్ఞురాల!
కావున రెండవ వర మేదేని గోరుకొనుము.

కైక—నా కట్లు వలనుపడదు. రఘువంశపు రాజు లాడినమాటదప్పువారు కారు. నా కా రెండువరంబుల నొసంగుడు. లేదేని ఆత్మహత్య జేసికొనియైన ప్రాణంబుల బరిత్యజించెదను.

దశర—అక్కటా! నా ప్రాణముమీదికి వచ్చినదికదా! కైకా!

చ. కరముల బట్టువాడ గుతు ♦ కమ్మున సర్వధరాధిపత్యమున్
భరతున కిచ్చువాడను కృ ♦ పామతివై మునిలోకపూజ్యుడై
వరలెడు రామచంద్రగుణ ♦ వంతుని గేహమునందు నింతయూ
గిరమిడినిల్ప వేడెదను ♦ గిన్క నరణ్యముపాలు సేయకే.

కైక—కరములు కాను పదములబట్టినను నే నందులకు సమ్మతించుదానను కాను నాకుమాళ్ళు భరతశత్రుఘ్నులు పురమున లేని సమయమున యౌవరాజ్యము రామునకొసంగి నా బిడ్డలకు మనువృత్తి యిచ్చి నన్ను మీ ప్రియురాలి కౌసల్యకు దాసినిగా జేయదలచితిరా! మీ కీ న్యాయము తగదు. మాట దప్పకుంటిరేని నా కా రెండువరముల నొసంగుము.

దశ—నన్నుబోలిన నిర్భాగ్యుడు లేడుకదా! కేకయరాజనందనీ! భరతుడుమాత్రము నా కొమరుడు కాడా! నీవుమాత్రము నా ప్రియురాలవు కావా! యువరాజ్యాధికారము రాముని దగుటచేతను హఠాత్తుగ మంచిముహూర్తము లభించుటచేతను యీ కార్యము దలచితిని కాని భరతాదులపై ప్రేమలేక కాదు. అనుగ్రహించి రెండవవర మేదేని గోరుకొనుము.

కైక—మీ ప్రార్థనలు నా చెంతజనికరావు. భరతునకు యువరాజ్య మిచ్చితీరవలెను, రాముని వనవాసమునకు బంపితీరవలయును. లేకున్న నేను వరముల నీయలేదని బొంకుడు.

దశర—హా రామచంద్రా! సుగుణసాంద్రా! (మూర్ఛిల్లును)

రాము—(ప్రవేశించి) జననీ! కైకమాంబ! నీవు మాతండ్రిగారిని కోరినవరముల వినియున్నాను. అందులకై నీవు సంశయింపకుము. నే చెల్లించెదను.

చ. అనుపమ యౌవరాజ్యము సమస్తము తమ్ముడెయేలుగాక! యో
జననిరో నీయభీష్టముగ ♦ జయ్యన కానలకేగువాడ నా
జనకునియప్పు బర్వు శిర ♦ సావహించుచు దీర్చివేయగా
దనయుడనైననాకు దగ ♦ దా! మదిశంకను వీడుమమ్మరో.

కైక—రామభద్రా! ఎట్లైన నీవు సకలగుణాభిరాముడవోయి నీ యోగ్యత మెచ్చదగినదే.

దశర—(లేచి)హా రామ! హా రామ! కౌగలించుకొని విచారించును)

రాము—జనకా! ఏల మీకీవెఱ్ఱిశోకము. సమాశ్వసిల్లి యొకసారి నన్ను జూడుడు.

దశర—వత్సా! నిన్ను వనములపాలుచేసి నే నెట్లుబ్రతుకుదునోయి! (విచారించును)

రాము—తండ్రీ! నామాటవినుడు యింత దుఃఖింపగారణమే లేదు.

చ. పోరిబోరి బొర్లశోకమును ♦ బుక్కిటబట్టుము పుత్రులెప్పుడున్
గురుని ఋణంబు దీర్చుటకె ♦ కుంభినిలో జనియించుచుండ భా
మరుని విధానశోకమున ♦ మ్రగ్గకుమయ్య ధరాతలంబు నా
భరతుడెయేలు నేను వన ♦ పాలనసేతు జగంబు మెచ్చగన్.

దశర—ఓసీ పాపాత్మురాలా! కైకా! నాకుమారుడు రామచంద్రుని కెంత ఘాత దలచితివే.

రాము—జనకా! మా పినతల్లి కైకేయి కిచ్చిన వాగ్దానమును విడువుడు.
ఆమెకిచ్చినవరంబులు చెల్లించుట మీకును మీ తనయులమైన
మాకును విధికృత్యము. నేను సంతోషముతో సర్వరాజ్యమును
భరతునకిచ్చి నేనరణ్యవాసమునకు బోయెదను. మఱియు
మీ ఋణము దీర్చితినని సంతసిల్లుదు.

దశర—అక్కటా! రామచంద్రా! నిన్ను విడచి యొక్కగడియయైన
ప్రాణములతో మనజాలుదునా!

రాము—తండ్రీ! యూరడిల్లుడు.

చ. జనకుఋణంబుదీర్చి బుధ ♦ సంతతి మేల్బళియంచు మెచ్చ కీ
ర్తిని దశదిక్కుల న్నిలిపి ♦ ధీరత తేజము గాంచినప్పుడే
తనయుడు కాని యూరక వ్య ♦ థాంచనంబుల బల్కుచుండి చెం
తను వసియించినంత నె సు ♦ తప్రవరుండె! వచింపు మార్యుడా.

దశర—నాయనా! రామున కరణ్యవాస మను కఠురము లేనా హృద
యమును గాల్చుచున్నదోయి ఈమాటవిని కౌసల్యామాత్రి
మెట్లు జీవించునోయి?

కౌసల్య—(ప్రవేశించి) హా కుమార! రామభద్ర! (కౌగలించి
యేడ్చును) బిడ్డా! నీకరణ్యవాసమను మాట నాహృదయము
భేదించుచున్నదిరా నాయనా!

రాము—జననీజనకులార! నా జనయిత్రి కైకమాంబ యీవిషయ
మున నాకు మహోపకారమే చేసినది. ఏమందురా!

చ. కొమరునికంటె నాయెడల ♦ గూరిమి హెచ్చయినందుచేతనే
యమిత సమస్తరాజ్య భర ♦ మాత్మజుమస్తకమందుబెట్టి, శాం
తమగు నరణ్యపాలన వి ♦ ధానము నాతలమీదబెట్టె నై
కమ సుతుకంటె నన్ను నధి ♦ కాప్తతజూచుటగాదె! యోచినన్.

కావున మీరీవిషయమై విచారింపవలసిన యవసరము లేదు.

దశరథ—హా కుమారా! సుగుణంబులు సంస్తవనీయంబులుకదా నాయనా!

ఉ. ప్రాణములైదు రామమయ ♦ భావము తోట ననున్ త్యజించియా
కౌసలకీవుపోవ గోడు ♦ కా యికతుచ్ఛములైన ప్రాణముల్
మేనవసించునే యకట ♦ మేదినితో బనియేలనాకు, కు
మారా! నినుజూచు భాగ్యమిక ♦ రా దిదియేకడసారియే జుమీ.

రాము—జనకా! అట్టి యమంగళపుమాటల బలుకకుము. పదునాల్గేడులు పదునాల్గు గడియలట్లు గడపివచ్చి మరల నినుగాంచెదను.

కౌసల్య—అమ్మా! కైకా!

ఉ. పట్టము నీ కుమారునకె ♦ ప్రాభవలీలల గట్టవచ్చు, నా
పట్టిన భీకరాటవుల ♦ పాలొనరింపక యింటిపట్టునన్
పట్టెడు ముద్దబెట్టుచును ♦ బాలన సేయగదమ్మ జ్యేష్ఠుడై
పొట్టకు జాలినంత సిరి ♦ బొందగ జాలడె కేకయాత్మజా!

తల్లీ! కటాక్షించుము నీచరణంబులకు మ్రొక్కెదాన.

కైక—కౌసల్యా! నీయిచ్చకములకేమిలే. ఏనాడో నాభర్త నాకిచ్చిన వరముల నీనాడు నేను పుచ్చుకొనుటతప్పా. నాకొడుకులు పురమున లేనిసమయమున నీకొడుకునకు రాజ్యాభిషేకము సేయించుకొనుటకు సిద్ధపడితివా లేదా! ఎవరిలబ్ధి వారు పోగొట్టుకొందురా! కావున తప్పక రాము డడవులకు బోవ వలసినదే

దశరథ—హా రామచంద్రా! నీకెంతగతి పట్టినదిరా! యీరాకాసికైక యీరవికుల కాననకుఠారి యీపాపాత్మురాలు హా తండ్రీ! హా కుమారా! నీపాలిటికి మహామారి! మహామారి! హా రామా! హా రామా!! హా రామ!!! (మూర్ఛిల్లును.)

కౌసల్య—హా! యెంతపిర్దయురాలవమ్మా! భర్తగారి కిట్టి శోకమును బుట్టించితివమ్మా!

రాము—తల్లీ! నీవు కైకమాంబను నిందింపవలదు. ఆమె యిట్టి పట్టు పట్టకున్న దండ్రిగారి ఋణవిముక్తియేకాదు అమ్మా! కైకమాంబ! నేను తప్పక అరణ్యావాసమునకేగెదను. నీవు శంకింపకుము.

కైక—అటులైన సరియే ఇతరుల మాటలతో నాకేల?

సీత—(ప్రవేశించి) హా ప్రాణేశ్వర! (పాదములబడును)

రాము—(లేవనెత్తి) దేవీ జానకీ! వలశోకించెదవు? ఈ శరీరంబులు నీరాజ్యంబులు నీ యఖిల భోగంబులును అతి చంచలంబులు. ప్రాజ్ఞులు వాటికై మురిసి యానందింపరు. అంతియె కాక యీ కైకమాంబ నాకు గడుమేలు చేసినది, యేమందువా!

గీ. అధిక చంచలమైన రా ♦ జ్యరమయెల్ల
గన్నకొమరునిపై బెట్టి ♦ కరుణలేక
శాశ్వతంబైన సాధుర ♦ తుణయశోర
మాధిపత్యమునాకిచ్చె ♦ నాదరమున.

కావున నీవిందులకై సుంతయు విచారింపకుము. వదునాల్గేడులు నన్ను విడచియుండ వలసి వచ్చినదని విచారింపకుము.

సీత—హా నాథా! భర్తృనియోగ సంతాప మతిదుర్భరముకదా!

సీ. ప్రాణేశ మనచెల్మి ♦ భవుని చాపారోప
ణమునకై తిరిగిన ♦ న్నాళ్ళులేదు
మనపెండ్లి మంగళ ♦ ధ్వనులుకర్ణములందు
మలయుటలింకను ♦ మాన లేదు
మనముకట్టినయట్టి ♦ మధుపర్కముల బ్రహ్మ
ముడియాన వాలింక ♦ సడలలేదు

సిగ్గుహెచ్చుటచే ♦ సిరిమించు మోమోము
సరిగ గండ్లార గాం ♦ చంగ లేదు

గీ. కటకటా! మనయిద్దరి ♦ కలయికలకు
సంతరాయము కల్గెనే ♦ యింతలోన
నాథ! మీమ్రోల విడచి ప్రా ♦ ణముల నిలుప
జాల ననుగూడ గొంపొండు ♦ నరగవనికి.

రాము—జేలా! మైథిలీ! శిరీషకుసుమ కోమలివైన నీ కరణ్య
సంచారము కడుదుర్భరముకదా!

సీ. లలితాంగి! పూవురే ♦ కుల బాదమిడ లేవు
కరకురాల్త్రోవల ♦ జరుగగలవె!
జాబిల్లికళలకే ♦ సైచి నిల్వగ లేవు
మిడియెండలకునోర్చి ♦ నడువగలవె!
పులుగుల గజిబిజి ♦ పలుకు లేవిన లేవు
పులుల బొబ్బలకెట్టు ♦ నిలువగలవె!
సురటివీవనలకే ♦ సొక్కకుండగ లేవు
ప్రబల వాయువుల కో ♦ ర్వంగగలవె!

గీ. అక్కటా! రాక్షస ♦ ప్రచారార్హమైన
నడవియెక్కడ గల ♦ హంసయాన వేడ
సంచరించుట లదియేల ♦ స్వప్నవార్త
వినుము నావెంట రాకుమో ♦ వనజగంధి.

సీత—జీవితేశ్వరా! మీరట్లనిన నేనేమందును!

ఉ. సతులకు మేనిచందనపు ♦ జర్చయు గన్నులకున్ సుధాంజన
స్థితియును నాత్మకాత్మయయి ♦ చిత్తసరోజ కుటీరవాసియౌ
పతి విడఁబాయుకంటె తమ ♦ ప్రాణము వీడుట మేలు కాదె! దు
స్థితిబడి మీరు కానల గృ ♦ శింపగ నింటను నేసుఖింతునే!

-వృస ప్రాణేశ్వరా! సుఖమో కష్టమో మీరెందున్న నేసం జేయుం
డెదను. నారాక కంగీకరించువరకు నేను మీపాదముల విడువజాల.
(పాదముల బట్టుకొనును)

రాము—ప్రేయసీ! నిరాక కంబుకే సమ్మతించితివి లెమ్ము.

లక్ష్మ—(కోపముతో ప్రవేశించి) ఔరా! రఘుకుల చూడామణి
వైన శ్రీరామమూర్తికి అరణ్యావాసమా! ఆహా! ఎంతటి
చెడుకాలము వచ్చినది. అన్నయ్యా! రామచంద్రా! మీ
కిదేమి వెర్రి!

చ. ముసలితనంబు చేత మతి ♦ పోయెనొ కైకను దుష్టతాంత్రిక
వ్యసనము చేతనో గురుడు ♦ ప్రాజ్య ధరాధిపతిత్వ మెల్ల కై
క సుతునకిచ్చెగాక విను ♦ గానల కేగుమనంగ నెవ్వడీ
రసికుడు నీవు పోవ నగరా దొ ♦ వరైనను విన్న రమ్మికన్
(చేయి పట్టుకొని లాగును)

రాము—తమ్ముడా! యిది గుర్వాజ్ఞకదా! చెల్లించుట నాకువిధ్యుక్త
ధర్మము. కావున నాకడ్డు పెట్టకుము.

లక్ష్మ—అన్నన్నా! యెంతకష్ట మెంతకష్టము!

శా. ఓసీ కైక! వరంబులంచు బతిని ♦ ట్లో బుట్ట గోబెట్టి, ధా
త్రీసామ్రాజ్యము నాత్మపుత్రునకు గూ ♦ ర్చన్ జేసితే గాక రా
కాసీ! యీరఘురామచంద్రునకు ను ♦ గ్రారణ్యవాసంబు నే
లా! సంధింపగ బుద్ధిపుట్టె ప్రపలేదా ♦ సుంతయున్ దుర్మతీ!
నిన్నీ తీవ్రాసిచే మత్తునియులు జేసి మావంశమును నిష్కంట
కము గావించెదను జూడుము. (ఖడ్గము నెత్తిమీదికి బోవును)

రాము—(వారించి) తమ్ముడా! శాంతింపవోయి! ఆడుదానిపై గత్తి
దూయుటదగునా!

లక్ష్మ—అన్నయ్యా! యెట్లు శాంతింపుమ నెదవు!

ఉ. లోకములెల్ల నీ రవికు ♦ లుండగు రాముడె యేలుడంచు న
స్తోక ముదంబునన్ బొగడ ♦ నొంచ్చపుబుద్ధిని నిన్ను రాజ్య సు
శ్రీకెడబాపి కానల గ్రు ♦ మ్మంపగ బొమ్మన ధర్మమౌనె! యీ
కైకను కేకయాత్మజుల ♦ ఖండనసేయక శాంతిగాంతునే

అన్నన్నా! అఖండ తేజోమయ ప్రభాకర మరీచికా మంజరిని జూచి సహింపలేని దివాంధమువగిది జగజ్జన శ్లేయమాన పవిత్ర చరిత్రుడైన యీరఘుకులపారావార చంద్రుడు రామచంద్రునిగాంచి యీదుశ్చారిణి యీకులపాంసని యీకైక సహింపలేక అరణ్యావాసమును విధించెనుగా! ఔరా! కాలమహిమ!

రాము—తమ్ముడా శాంతింపుము. మాతృదేవతనునిందింపరాదు. ఆమె దుశ్చరిత్ర యైనను నీవిపు డనార్యమగు కోపమును వహించి దుశ్చరిత్రుడవు కాజూచుచున్నావు.

ఉ. కోపము రాజ్యవృక్షమున ♦ కున్ జరికింపగ వేరుబుర్వు సం
తాపము గొల్పునగ్ని శిఖ ♦ ధార్మిక చింతల నూడ్చివేయగా
జీపురుకట్ట సౌఖ్యముల ♦ చేటు లఘుంబుల కిల్లునైన యీ
పాపపు గోపమూనుటలు ♦ భావ్యముకాదుర శాంతిగాంచుమా.

వత్సా లక్ష్మణ! నాయందు భక్తి కలిగినవాడవేని శాంతించి యీయమను నిందింప కుందువని తలంచెదను.

లక్ష్మ—అన్నయ్యా! నీవు నన్ను వారించుచున్నావు కాని యీకైక కీఘోర (పండ్లు గొరుకుచు) కృత్యముతగునా! అన్నా! ఎంత శెంతలు పుట్టుచున్నవి.

రాము—వెర్రితమ్ముడా! మనసున శాంతివహించినామాటవినుమా! దైవ నిర్ణయమునం జేసి నావనవాసవిధికి గైకమ్మ నిమిత్తమాత్రురాలైనది కాని నేరకాదు. నాఫలమున నిట్లువ్రాసి యుండ గైకవలుకకున్నను మరొకవ్యాజమునైన నాకీశ్రమ

తప్పదు. ఇంతకును నే నీయుద్యోగము నాకిట్లు విధించెనో కనుగొన జాలము. నేను పోయివచ్చెదను. నీవు సంతసించి నన్ను నంపుము.

లక్ష్మ—అన్నయ్యా! ఎంతమాట పలికితివి!

చ. అనఘచరిత్ర! నీవు వన * మావల కేగిన తక్షణంబె ప
త్తనము శ్మశానవాటిక యి * కంబునఁ జొప్పదె! పౌరులెల్లరున్
వసటను జెందరే! అటుల * వాక్పతికెక్కి పురిన్ వసింప నొ
ల్లను దమవెంట వచ్చెదను * లక్ష్మణుపై దయయున్న నొప్పవే.

రాము—తమ్ముడా! నాకొరకు కౌసల్యాదేవి పరితాపమునకు దోడుగా నీవలన సుమిత్రాంబకు నూర్మిళకు గూడ సంతాపము గలిగింపరాదు. నీభక్తికి మెచ్చితిని. నామాటవిని నీ వాగిపొమ్ము.

లక్ష్మ—అన్నయ్యా! త్రిలోకపూజ్యుఁడవైన నీకే సంతాపదశకలుగ నీ సుమిత్రామాతకును నాకును కలిగిన నసంబద్ధమా! కావున నీవాజ్ఞ నీయకున్నను నీవెంట నేను రాకమానను.

రాము—వత్సా! అట్లయిన రమ్ము.

కైక—(తనలో) యీకోపదారి వాడు రాముని వెంట బడి పోవుటకు సమ్మతించుటచే నాభయము తీరినది. (ప్రకాశము) రామమూర్తీ! అడవులకు బోవువారికి నారచీరల సిద్ధపఱచితిని. ధరించి పోవువారెవ్వరో వేగ బోవలయు.

రాము—అమ్మా! యిదే పోవుచున్నాము. లక్ష్మణా! మనవియోగముచే మరింత తపింపకుండ దండ్రిగారిని ప్రబోధింపక నే నమస్కరించి పోవుదము.

లక్ష్మ—ఇట్టివానిని ప్రబోధించుటయుగూడ ననవసరమే.

రాము—తల్లీ! పోయివచ్చెదను. (తల్లికి నమస్కరించుచు)

సీత—అత్తా! పోయివచ్చెదను.

కౌసల్య—హావత్సలార! ఎట్లు సహింతునురా!

రాము—గీ. ఎన్నటికి మిమ్ము జూతుమో ♦ కన్నతండ్రి
చాల దయయుంచుమయ్య రా ♦ జన్యతిలక
లక్ష్మ— కానలకు బోవుచున్నాము ♦ కైక వలన
సీత— మీఋణము తీరెనుక దయ్య ♦ మేదినీశ.
కౌసల్య—హా రామచంద్ర ! (మూర్ఛిల్లును; తెరపడును)

---

౨ వ రంగము : అయోధ్యాపురవీధి

[ భరతశత్రుఘ్నులు ప్రవేశించెదరు ]

భరతు—తమ్ముడా ! శత్రుఘ్న ! మనము బయలు వెడలినది మొదలుకొని అన్నియు దుశ్శకునములే తోచుచున్నవి. యేమి యాపద మూడెనో కదా !

ఉ వామ భుజంబుకంపిలెడు ♦ వాయసమొక్కడు కట్టిడి ర్చెన
య్యో మది కొందలంపడెడు ♦ నొయ్యన గొట్టుకొనంగసాగె నా
వామ విలోచనంబు తడ ♦ బాటొదవెన్ జరణంబులందు నిం
కేమివిపత్తు వించు మొకొ ♦ యింతయు దోచకయుండె తమ్ముడా.

శత్రు—అన్నయ్యా ! నా హృదయముగూడ శంకాకులితమగుచునే యున్నది. ఇందువలన మనకేదియో యప్రియమే వినబడునని తలంచెదను.

భర—వత్సా ! శత్రుఘ్న ! చూడుమూవంక.

సీ పుంగోపురద్వార ♦ ముల తోరణంబులు
బంధించి విడచిన ♦ పగిదిదోచె
అల్లదే సౌధాగే ♦ హాళుల జిత్రపురంగు
లద్దుచు నాపిన ♦ యట్టులోచె
అదె పణిక్సంఘుంబు ♦ లాత్మవస్తువులమ్ము
కొనమాని చింత ♦ తో గూరుచుండె

నలు గెలంకుల దుకా ♦ ణాపు గొట్టులను మాని
వేసినా రేల యు ♦ ల్లాసముడిగి
గీ. మనలగాంచియు బ్రజలు చూ ♦ డని విధాన
మోము లావలకును ద్రిప్పి ♦ నేమి కతము
పురమునం దేమి యాపద ♦ మూడెనొక్కొ-
తమ్ముడా! చూడగా వి ♦ చారమ్ము పొడమె.

శత్రు—అన్నయ్యా! ఏదో విపత్తుమూడెననుమాట నిశ్చయము. అదే కదా! కైకమాంబగారి భవనము. ఆమెవలనగాని మనకు దెలియదురన్నా.

(విశ్రమించెదరు)

---

౩ వ రంగము : కైకభవనము

భరత—తమ్ముడా! అయోధ్యాపురమెల్ల యెట్లు శోభాదరిద్రాణంబై యున్నదో, మనతల్లిగారి మందిరముకూడ నటులే శోభావిహీనమై యున్నదిసుమీ! తప్పక యేదో గొప్ప యాపదయే తటస్థించి యుండనోపు.

శత్రు—ఇంకను సందియమేల?

కైక—(ప్రవేశించి) హా కుమారులారా! (కౌగలించుకొని దుఃఖించును)

భరత—తల్లీ! ఇంతవిచారమునకు గారణమేమి? పూజ్యులైన నా తండ్రిగారికి గుశలమా?

కైక—అయ్యో నాయనా! యిక నెక్కడి తండ్రిగారోయి, ఆమహాత్ముడు స్వర్గస్థుడైనాడు కదా!

భర—హా తండ్రీ!<br>శత్రు—హా జనకా! } (మూర్ఛనందుదురు)

కైక—కుమారా! కాలగతి అట్లున్నది విచారింపకుము.

భర—(లేచి) హా సుతవత్సల! హా జనకా!

చ. సరవిని దేవదానవులు ♦ సంగరమందున దైత్యకోటులన్,
నురుమునఁ జేసి దివ్యుల క ♦ నూనజయంబును గూర్చి సత్యశో
స్ఫురణము సర్వదిక్తటుల ♦ శోభనజేసిన యట్టి తండ్రి! దు
ర్భరతర దుఃఖవారిధి ని ♦ బాలుర మమ్ముల ద్రోసిపోయితే.

శత్రు—హా కుమార ప్రియజీవిత! తండ్రీ!

చ. ప్రవిమల సచ్చరిత్ర! కుము ♦ దాసి దిశంబు నలంకరించితే
రవిసమతేజ! యో యమర ♦ రాజ జయాస్పద! నీవు లేమిచే
భువనము లాక్రమించెగద ♦ ఘోరతమంబు ప్రభాకరుండు లే
నివిధముగా జగంబులకె ♦ నిన్ను త్యజించి సహించుటెట్లొకో!
హా సుతవత్సల! నీకుమార చతుష్టయమున కేమిగతి చెప్పితివి?

భర—అమ్మా! అస్మత్పితృని యస్తమానదశకు కారణమేమి?

కైక—ఏమని చెప్పుదునోయి రాముని వియోగ కారణమే!

భర—ఏమీ! రాముని వియోగమా! ఆతడెందు బోయెను?

కైక—రాము డరణ్యవాసమునకు గదా పోయియున్నాడు.

శత్రు—హా! రామున కేమి! అరణ్యవాస కర్మమేమి?

కైక—మీ తండ్రిగారు తొల్లి నాకు రెండువరము లొసంగినారు. అందు నీకు యౌవరాజ్య పట్టాభిషేకమును సేయుటను రాము నకు బదునాల్గేడు లరణ్యవాసము నిర్ణయించినారు.

భరత—నిన్నాయన వరము లడుగుమన నీవీవిధంబుగ గోరి రాము నడవులపాలు చేసితివిగా! ఓసీ! కులపాంసనురాల! కైక! యెంతఘాత తలచితివే.

ఉ. కేకయరాజవంశమను ♦ క్షీరపయోధి హాలాహలంబనా
వ్యాకులహేతువై జనన ♦ మంది దినేశకులంబునెల్ల చీ

కానుపడంగ జేసితివి ♦ కా ! కులపాంసని ! రామచంద్రును
శ్లోకుని గానలన్ గలిపి ♦ శుద్ధచరిత్రుని భర్తఁ జంపితే.

శత్రు—ఓసీ ఘాతకురాలా ! ఆ సర్వలోకవంద్యుని రాముని కానలపాలు సేయుమని కోరుటకు నోరెట్లులాడెనే !

కైక—శత్రుఘ్నా ! పితృవాక్యపరిపాలనము సేతునని నేను కోరునంతలో ఆత్ర పడిపోయినాడు. అందులకు నేనేమి సేయుదును. వాని వియోగము సహింపలేక హా రామ ! హా రామ ! యని వెంగటిల్లి నీ జనకుండు స్వర్గస్థుడైనాడు. ఇంతకును ఏ కార్యమైన మగవారిచేతులో నుండును కాని ఆడుదానిచేత నుండునా ! అది తలచిన కార్యమగునా ! మీ తండ్రిగారి కళేబరమును తప్తతైలకటాహమున నుంచి దాచి యుంచినాము. మిగుల వగవక అగ్ని సంస్కారము చేసి పిదప రాజ్య మేలుకొనుము.

భర—హా జనకా !

ఉ. రాముని బుణ్యశీలుని న ♦ రణ్యము పాలొనరింప రాకటం
చీమెకు బుద్ధి చెప్పఁగదే ♦ వినకున్నను జంపరాదె క
ట్టా ! మహనీయ మూర్తిని వ ♦ టాలున గానలకంపి పుత్ర ! హా
రామ ! యటంచు నేడ్చుచును ♦ ప్రాణములన్విడనాడఁజెల్లునే.

కైక—భరతా ! నీ వన్నట్లు తన కిష్టములేకున్న నాకు బుద్ధి చెప్ప రాదా ! వినకున్న జంపివేయరాదా ! యింతకును కారణార్థ మట్లున్నది. వారలకై విచారింపక భవిష్యత్కార్యమును జూడుము. జన్మించుట మరణమునకే గదా !

భర—శా. నీ వేదాంతము మండిపోవునుగదే ! ♦ నీకింత సిగ్గైన లే
దా ! విశ్వేశుడై రాముడంచును బుధుల్ ♦ స్తోత్రంబుల జ్జేయగా
నావిజ్ఞానిని దారద్రోలి పతికిన్ ♦ బ్రాణంబులం దీసి పై
గా విశ్వంభర నేలుకొమ్మనెదులో ♦ కంబుల్ ననున్ దిట్టవే.

కైక—భరతా! లోకము నెన్ని దిట్టుట కంత క్రొవ్వేనా! లోకుల కేమి-పలు కాకులవంటివారు, అన్నదమ్ములలో నొకడు రాజ్యమేలిన దక్కినవారికి మనువృత్తియే కదా! ఆ నా డిచ్చిన వరములచే నీకు రాజ్యము సంప్రాప్తమైనది. నీ పుణ్యము మంచిది. నావలన నీ కీ పదవి వచ్చినదని సంతో షింపక పైగా ఆగ్రహము జెందుచుంటివా!

భరత—ఏమీ! మాతండ్రి నీకు వరములనసే యిచ్చెనుగాని యీ విధములైన వరములను నీవు కోరకయే నాతండ్రి యీ విధుల నేర్పరచెనా?

కైక—నేనే కోరితినిలే అయినను నీ మేలుకొరకే నేనిట్లు కోరితిని గాని నేను నెత్తిని బెట్టుకొని యూరేగుటకు గాదు. రాముని బాయలేక లక్ష్మణుడును సీతయుగూడ నడవులకే పోయి యున్నారు.

భరత—ఛీ, ఛీ, కులపాంసనురాలా! నా అంజరికిని మారకగ్రహ మవు గాని తల్లివి కావేనీవు.

చ. జనకునిజంపి భ్రాతకఘ ♦ సత్తము భూవలమాత సీత, ల క్ష్మణుల నకారణంబుగను ♦ కానల పాలొనరించి నింద మా లిని ధరియించి సిగ్గు విడ ♦ లించి ధరాభర మేలుకంటె జ చ్చిన గడు మేలుకాదె, కుల ♦ శీలము మంటలపాలు సేసితే.

కైక—అన్నన్నా! ఎంతపిచ్చివాడవుర భరతా!

ఉ. సంగరమందు నీ పితకు ♦ సాయముచేసి వరాలగాంచి యి బ్బంగిని రాజ్యమున్ గొనగ ♦ వద్దనుమూర్ఖుడు వేఱొకండు భూ మింగలడే సమస్తమగు ♦ మేదిని రాజ్యము చేతజిక్క నీ వెంగలిబుద్ధిమాని రఘు ♦ వీరుడవై ధర నేలుకొమ్మికన్.

భర—ఓసీ పరమదురాత్మురాలా!

ఉ. ఇంకొకసారి యిట్లు వచి ♦ యుంచితివే స్వపదీయశీర్షమున్
గొంకక ద్రుంచివైతు జన ♦ కున్ బొలియించి మహానుభావు ని
శ్శంకత నన్నుఁద్రోలు కల ♦ షంపుఫలంబును బొందఁజేసి దో
షంకిలచిత్త! రాముపద ♦ పద్మములన్ భజియింప బోయెదన్.

ఇక నీవు నోరుమూయుము. పూజ్యురాలైన కౌసల్యాదేవి పదముల బడి యీ దోషము నే నెఱుంగనని తల్లియని వేడుకొని యుత్తరక్రియ లాచరించి ఆ శ్రీరామమూర్తివలె నేనును వల్కములు ధరించి యరణ్యములకు బోయి నా యగ్రజు చరణసేవ సేయుచు గాలము గడపెదను: శత్రుఘ్నా! యికరమ్ము.

(అందరు నిష్క్రమింతురు)



శ్రీ

# సంపూర్ణ రామాయణము

* * *

## షష్ఠాంకము

### 1 వ రంగము—చిత్రకూటాచలము

[రామలక్ష్మణులు సీత ప్రవేశించెదరు]

రాము—దేవీ జానకీ !

చ. ఉరుతర భోగమందు మన ♦ యోధ్యపురిన్ సుఖయించు నిన్నుభీ
కరగహనాంతరమ్ములను ♦ గష్టములన్ బడలించుచుంటినో
సరసిజనేత్ర ! నామది వి ♦ చారము నేమని తెల్పువాడ బూ
సరమును నగ్నిమాడిచిన ♦ చాడ్పున నిన్హలయించి తక్కటా !

ప్రియురాలా ! భీకరారణ్యసంచారము అబలలకు దుస్సాధ్యమని యెంతచెప్పినను వినక, నా వెంటవచ్చి యెట్టి యిక్కట్టులపాలైతివో యనుభవ మయ్యెనుగదా !

సీత—ఆర్యా ! మీరు నాకై కొంతలపడవలదు,

గీ. ప్రాణనాయక మీ పద ♦ పద్మ సేవ
సలుపుచుండిన నితర క ♦ ష్టములు నాకు
సౌఖ్యములుగాగ దోచు ♦ నా స్వాంతమునకు
గాన నాకయి చింతింప ♦ మానగదవె.

అదియుగాక, యీ చిత్రకూటనగము మనకు గడువాస యోగ్యమైనది.

రాము—ప్రియురాలా! అల్లదిగో మహోన్నతము. నాయందలి భక్తియే నీ చేత నట్లు పలికించినది. చూడు మిదె చిత్రకూటాచలము!

సీ. కిన్నర మిథునముల్ ♦ కేళి విహారంబు
సలుపు చూపట్టు నా ♦ చాయ గనుమి
విధుమండలంబు జుం ♦ బింప సత్త్రత్సుధా
ధవళిత శిఖర సం ♦ తతుల గనుమి
వివిధరత్నద్యుతుల్ వె ♦ లయ జిత్రములైన
సానువుల్ కల ప్ర ♦ దేశముల గనుము
అల్లదే విమల జలా ♦ శయ సంఫుల్ల
కమలకానన సు ♦ గంధముల గనుము

గీ. ఈగతి మనోహరం ♦ బయి యొసగినట్టి
చిత్రకూటాచలమున వ ♦ సించువారి
కేరికి సుఖంబు నీయదో ♦ సారసాక్షి!
గాన శ్రమవాసి యిందు సు ♦ ఖంబు గనుమి.

సీత—ప్రాణేశ్వరా! ఈసుఖములు సుఖములా! మనము పదునాల్గేండ్లరణ్యవాసము చేసి సుఖంబుగ నయోధ్యకు జేరినప్పుడు కదా మనకు సుఖము?

రాము—తమ్ముడా! ఈకోలాహలమేమో చూడుమా!

చ. పులుగులు మింటికై యెగసె ♦ భూరిరవంబులతోడ జంతువుల్
గలుగుచు పారజొచ్చెడు న ♦ కారణమిట్టుల లేనిపోని వ్యా
కుల మొదవింపబోదు కను ♦ గొమ్ము యథార్థమ్మునకేమి హేతువో
వలనుగ దమ్ముడా! మనము ♦ వారణసేయగ నర్హమౌగదా!

లక్ష్మ—(అటునిటు చూచి) అన్నయ్యా! ఆ భరతుని దుండగము జూడుమా! సేనలతో మన మీదికి యుద్ధమునకు వచ్చుచున్నాడు.

మ. పదునాల్గేండ్లరణ్యముల్ దిరిగి యా ♦ పై వచ్చి తన్నున్నచో
కదనక్షోణి నెదిర్చి రాజ్యమును పీ ♦ కన్ జేకొనన్ రాముడం
చదయుండైక సుతుండు వచ్చె నదిగో ♦ చూడంగదే యోదయా
స్పద! నీ శాంతమె యింత దెచ్చె రణమున్ ♦ కల్పింగ లేలెమ్ము కన్

రాము—వెర్రితమ్ముడా! భరతునివంటి సుగుణార్ణవుడేమి? మన మీదికి యుద్ధమునకు వచ్చుటేమి! తనతల్లి చేసిన యపచారమునకై క్షమింపుడని మనల వేడుకొనుటకై వచ్చుచున్నాడు కాని చలపాదియై వచ్చుటలేదు. కావున నీవు త్వరపడి చాపము నెక్కుపెట్టకుము.

లక్ష్మ—అక్కటా! అన్నయ్యా! కత్తి నెత్తిమీదికెత్తినను పూలదండయనియే తలంచుచుంటివిగా! సరే అటుపిమ్మట నీవే తెలిసికొనగలవు.

[భరతశత్రుఘ్న వశిష్ఠులు ప్రవేశించెదరు]

భరతు—(చేతులు జోడించి) హా సర్వలోక శరణ్య! రామచంద్ర!

ఉ. రామగుణాభిరామ! రఘు ♦ రాజవిరామ! దినేశసత్కులా
రామ వసంత! ప్రోవవె ప ♦ రాత్పర! నా జనయిత్రి దుష్టయై
నీమహిమంబు సుంతయు గ ♦ ణింపక కానలపాలు జేసె న
య్యామది క్రౌర్యమూనక ద ♦ యామతి నన్ను సముద్ధరింపవే.

(పాదములమీద బడును)

రాము—తమ్ముడా భరతా! నీకీ వెత్తియేల? కైకమాంబ నాకేమియు నెగ్గుసేయలేదు గుర్వాజ్ఞను పాలించుటకై నేన యీవనవాసమునకై వచ్చితిని. ఆమెపై నాకెంతయు గ్రౌర్యము లేదు. నీవు సంకోచింపకుము కాని.

ఉ. బిడ్డలబోలు పౌరులను ♦ వీడి మహాత్ముని తండ్రి సేవలన్
బడ్డనద్రోసి సంయముల ♦ జక్కగ ద్రోవక రాజకార్యమే

యొద్దునద్రోసి యో వనుల ♦ నుండెదు నన్గనవచ్చినావె హా
చెడ్డలు మాడవే న్నపతి ♦ నీమను వీడినవెఱ్ఱి తమ్ముడా!

భర—అన్నయ్యా! లోకపూజ్యుడవైన నీవే యఖిలమును బాయు నీవియోగ సంతాపభరము నోర్వజాలక మనలగన్నతండ్రి దేహమును బాసి స్వర్గముజేర నేనిందు వచ్చుట హానియా!

రాము—ఆ! ఆ! మనతండ్రి దేహమును బాసినాడా! హాజనకా! (మూర్ఛిల్లును)

లక్ష్మ—హాసుతవత్సలా! (మూర్ఛిల్లును)

సీత—హాస్నుషాభిమానీ! (మూర్ఛిల్లును)

వశి—ఓ రామ లక్ష్మణులైన దేవులార! కాలవిపర్యయమునకు బ్రాజ్ఞుల య్యును మీరిట్లు శోకింతురా? లెండు లెండు.

భర—అన్నా రామచంద్ర! లెమ్ము. (లేవనెత్తును)

శత్రు—లక్ష్మణా! మనము నేటికి తండ్రిలేని వారమైనాము లెమ్ము విచారము మానుము.

రాము—హాసుతవత్సల! తండ్రీ!

ఉ. కౌశికుజన్మమున్ మనుప ♦ గా ననుబంపెదు నన్ను డేదయా
వేళముతోడ నశ్రువుల ♦ వేమరు గన్నులరాల్చినావు న్న
ద్వీశశిరోమణీ! వనుల ♦ కేగెద నిప్పుడటన్న బెంగచే
బ్రాణసమాని బ్రాణముల ♦ బాసిన వాడవె! పుత్రవత్సలా.

లక్ష్మ—హా జనకా!

ఉ. రామునిజాడ లక్ష్మణుడు ♦ రాడటె డెందులనుండెనంచు న
త్ప్రేమను బృచ్ఛచేసెదవు ♦ వేమరు నేగనుపింప నేడిరా
రాముడటంచు బల్కెదు ♦ నిరంతరమూ గతినొప్పుతండ్రి! మ
మ్మీ్మ మెయిబ్రోచు వారెవర ♦ హీన కృపాలయ పుత్రవత్సలా

సీత—హాస్నుషాభిమానీ ఆర్యమహాశయా!

ఉ. తల్లినిగాంచినట్లు గుణ ♦ ధాముని శాంతను జూచినట్లు స
న్నెల్ల విధంబులన్ గరుణ ♦ నేలుచు సూర్యకవంశమందు సం
పల్లలితాంగివంచుడయు ♦ వార నుతింతువు నన్ను నేటితో
సెల్లెనె! మీఋణంబు నృప ♦ శేఖర! మాగతిమేమిచెప్పితే!

వసిష్ఠు—రామభద్ర! లక్ష్మణ! బిడ్డా జానకీ! సద్గతినందిన వారల విష యమై విలపింపరాదు. రామచంద్రా! తనతల్లి కైక చేసిన యనార్యకార్యమునకు క్షమించి అయోధ్యకువచ్చినిన్ను రాజ్యమును పరిపాలింపుమని భరతుడు వేడుకొనుటకై వచ్చినాడు.

భర—అన్నయ్యా! పాపాత్మురాలైన నాతల్లి యపచారమును మన్నించుము.

రాము—తమ్ముడా! యిందు కైకమాంబ చేసిన యపచారమే లేదు. నీవు నామాటవిని.

చ. ప్రజలను పుత్రసామ్యులుగ ♦ భావనజేయుగదన్న మానిత
ల్లజులకు సేవజేయుచు వి ♦ లాసగ నీవమనాలుగేల్లు న
క్కజముగ గాసల న్దిరిగి ♦ క్రమ్మర నీ దరిజేరువాడ వి
శ్వజనులు మెచ్చ రాజ్యపరి ♦ పాలనమున్ బొనరింపు తమ్ముడా!

భర—అన్నా? నీవెన్ని చెప్పినను రాజ్యపరిపాలనము సేయజాలను.

మ. జనకుండాగతి ప్రాణము ల్విడువగా ♦ సామ్రాజ్య మేలంగ జా
లిన పూజ్యుండవు నీవె యీగతి వనా ♦ లిన్ భార్యతో ద్రిమ్మర ఘ
ఘనశోకాగ్నిని గాలిపోయిన స్మశా ♦ నక్షోణి రాజ్యంబునా
ననయంబున్ భరియింపజాల రఘు రా ♦ మా! వచ్చియేలంగదే.

రాము—తమ్ముడా నేను త్రికరణశుద్ధిగ జెప్పుచున్నాను వినుము. పితృవాక్యమేరికిని దాటగూడదనిదికదా? మనతండ్రి నీకాధరణీ సామ్రాజ్యమును నాకీ వన రాజ్యమును పాలింపుమని యానతి నిచ్చినాడు. ఇంతకును గారణభూతురాలు కైకమాంబ యన్ని

సీతామెపై నాగ్రహింపరాదు. ఆమె నిమిత్త మాత్రురాలు. ఇదియంతయు దైవనిర్ణయము, భగవంతుండీ నిర్ణయము సేయుటకు కారణమేమో మనము అనంతరముగాని తెలిసికొనలేము. భగవన్నిర్ణయము దాట శక్యముకాదు. నీవు స్వస్థచిత్తుడవై పోయి రాజ్యమేలుకొనుము. నాయందు భక్తికలదేని రెండవమాట బలుకక నేను చెప్పినట్లుచేయుము.

భర—అన్నయ్యా! అటులైన మీపాదుకలొసంగితిరేని వాటినొకచో నుంచి మీపేరున నందిగ్రామమున వసించుచు రాజ్యమేలెదను కాని మీరు రాకుండ నయోధ్యలో ప్రవేశింపజాల.

రాము—తమ్ముడ! అటులైన నీవే తీసికొనుము. (పాదుకలిచ్చును)

భరతు—

గీ. ఎవని పదపద్మ రేణు వా ♦ కింతసోక
రాతినాతిగ జేసె ప్ర ♦ ఖ్యాతిమీర
నట్టి శ్రీరామపాదుక ♦ లాదరమున
మౌళి ధరియించి రాజ్యంబు ♦ నేలువాడ.

(శిరమున ధరించును)

రాము—తమ్ముడా! నీకు శ్రేయమగుగాక.

వశి—రామచంద్రా, సుస్నాతులరై పితరులకు తిలోదకాదుల నిడచి యనంతరము దండకారణ్యమునకు బోవగలరు రండుపోవుదము

(అందరు నిష్క్రమించెదరు)





# సంపూర్ణ రామాయణము

## సప్తమాంకము

### 1 వ రంగము—దండకారణ్యము

[రామ లక్ష్మణ సీతలు ప్రవేశించెదరు]

రాము—దేవీ జనకరాజనందని! అత్రిమహర్షి చెప్పిన దండకారణ్యమిదియే సుమీ!

ఉ. క్రూరమృగంబులా పొదల ♦ ఘోరత బొబ్బలు పెట్ట భీతిమై
పారెడు మింటికై సకల ♦ పక్షిగణంబులు, లేళ్ళగుంపులున్
దోరముగాగ గుల్మముల ♦ దూరెడు నిందున దైత్యకోటి సం
చారము సేయుటబ్బురమె ♦ సంయము లిందువసింప నేర్తురే.

సీత—నాథా! యీదండకారణ్యము చూచుటకే భయమగుచుండ నిందువసించు వారెంతటి కర్కశులు కావలయును, కావున నీ యిందు రాక్షసులు వసింతురు. అబ్బా నాథా! నడువలేకుంటినిక దా!

చ. ఒక యడుగైన వేయుటకు నోపిక ♦ లేదుక దా, పథంబు కం
టకమయమయ్యె నెట్లొ, యిచటన్ గయిసేయుదుమన్న నున్కికిన్
సుకరము కాదు హైమ పడక ♦ జొచ్చెదు జమ్మటలూరె ప్రాణనా
యక యిక నేమిదిక్కు నను ♦ నావల జేర్చుట లెట్లొ దైవమా!

రాము—ప్రాణేశ్వరీ! కాంతార సంచార మెట్లుండు ననుకొన్నావు? దుర్భరమని నేను తొలుతనే చెప్పితినిక దా?

సీ. ఆరామ మాభీక ♦ రారామములు కాని
హంస యానములతో ♦ నాటలాడ
కేళీ పికవ్రజ శు ♦ కాలాపములె భీక
రారావములె కాని ♦ యాలకింప
సౌఖ్యాస్పదపు భర్మ ♦ సౌధంబులే సాధ్వి
శాత పాషాణముల్ ♦ సంచరింప
ఆళీ జనంబుల ♦ కాస్పదమే దైత్య
గణముల కిల్లు న ♦ ఖ్యంబు సలుప
గీ. రమణిరో యిట్టి భీకరా ♦ రణ్యమేడ
మించు బోడులకును విహా ♦ రించుటేడ
నన్ను విడనాడలేక ♦ యీయెన్నరాని
వెతల బడుచుంటి వీవు చె ♦ ప్పినను వినక.

సీత—ఓజీవితేశ్వరా! మనకర్మసూత్రమును మనలనిట్లు ఎడపించు
చుండ దాటదరమా కావున నాకొరకు విచారింపకుడు.

లక్ష్మ—అన్నయ్యా! నేనానాడే చెప్పితిని యీయాడుదానిమాటకు
మనము బద్ధులమై యిట్టిశ్రమకు దలయొగ్గరాదని. కన్నులార
చూచుచుంటివా! ఇపుడు వైదేహి యెంతశ్రమపడుచున్నదో!

ఉ. పాతకురాలి కైకను కృ ♦ పాణముచే బరిమార్చియున్న నీ
భూతలమాత సీత వన ♦ భూముల సంచరణంబు సేయుచున్
బ్రాతిగ శాతకంటక వి ♦ భంగ పదాంబుజ యాచునిట్లు నే
శ్రాతత బాష్పబిందువు ల ♦ నంతముగా గురియంగ సాగునే.

రాము—తమ్ముడా! ఎంత చెప్పినను నీధూర్తత్వము మానకుంటివిగదా!

లక్ష్మ—అన్నా! మనకిన్ని కష్టముల గలుగజేసినదురాత్మురాలియెడ
ధూర్తత్వము జూపుటనుచితమా!

రాము:—

మ. అదిగో కోపముమాను మన్నస్మృతి లేదా ♦ తమ్ముడా! మెట్టి దు
ర్మదవాక్యంబుల బల్కజొచ్చితివి! శా ♦ ర్ఙ్గంబెల్ల మాతృవ్యథా
స్పదమానట్టుల జేయబాడిరయో తా ♦ చ్ఛ్రక్రీకినాశించియా
సుతతిన్ దల్లిని జంపుటల్ రకికు ♦ లక్ష్మీ భంబుగాకుండునే.

లక్ష్మ—అన్నయ్యా! మాతల్లి పై దేహీపదు కడగండ్ల జూచిసహింప జాలక అట్లంటి నాయుపచారమును మన్నింపుము.

[తెర లేవ విరాధుడు వికృతాకారముతో ప్రవేశించును]

విరా—ఆహాహా! నేడెంత మంచిదినము! చిరకాలమునకు నాకు మను ష్యమాంసము లభించినదే. వహావ్వా! యీపిల్ల బహుకోమల ముగ నున్నది. తాటితేగిలోని లేత చందమామవలె బహురు చిగా నుండును. ముందుదీని జవిచూచెదగాక.

(సీతను పట్టుకొనును)

సీత—హా ప్రాణేశ్వరా! (మూర్ఛిలును)

విరా—ఓరోరి మనుష్యాధములారా! అఖిలదేవయక్షకిన్నర విద్యాధర మనుష్యలోక దుర్నిరీక్షుడైన యీవిరాధుడు సంచరించు భీకరారణ్యమున మనుజులుసంచరింపవెరతురే! ఔరా! మీరు తాపస వేషములతో నెంత నిర్భయముగా ప్రవేశించితిరిరా.

లక్ష్మ—అన్నయ్యా! త్వరపడి వేగ వీనిపై శరమును సంధింపుము.

రాము—(బాణముల విడిచి) ఓరీ! విరాధ! యిదే చచ్చితివిరా!

విరాధు—ఓరిక్రకుంకా! (ఆబాణములందికొని విరచివైచి) మీరు నన్నాజంపునది?

రాము—ఔరా! ఆశ్చర్యముకదా! (మరల బాణముల విడుచును)

విరాధు—ఓరీ మీబాణములే నాకింత రుచిగానుండ మీరెంత రుచిగా నుందురోకదా! ఈయాడుదానితో నాకేల. (సీతనువిడచి రామలక్ష్మణులను బట్టుకొనును)

లక్ష్మ—అన్నా! వీని కునల నెత్తికొని పోవుచు బాహువులను నర కుదము (నరకుదురు)

విరాధు—(కూలి) మహాత్మా దశరధరామచంద్రా! నిన్ను బరాత్పరుడని తెలిసికొంటిని నీవలన నాకు శాపవిమోచనమైనది. నేను తుంబురుండను గంధర్వుండను రంభాలోలుడనై కిన్నర నాధునాజ్ఞ నుపేక్షించుట నాకీ శాపమొసంగె నంతనేను ప్రార్థింప కరుణాఘనుండై లోకరక్షణార్థ మవతరించిన దశరథ పుత్రుడైన రామచంద్రుండీ మార్గమునవచ్చి నీ బాహువు లెప్పుడునరుకునో అప్పుడు నీ శాపవిమోచనమని యొసంగెను. అది మొదలు మీరాకకై వేచియుండి నేను కృతార్థుడ నైతిని నా కళేబరమును ఖననమున పూడ్చిరేని దివ్యశరీ రముదాల్చి ముందు మీరేగ వలసిన మార్గంబును జెప్పిపోయె దను. స్వామీ! మీరికివే వందన శతములు.

రాము—తమ్ముడా! యీ విరాధుని పూడ్చి వేయుము.

లక్ష్మ—చిత్తము (వానినీడ్చుకొని పోవును)

రాము—(ఆకసము వంకజూచి) ఏమీ! ఏమనుచున్నావు? సమీపమునయున్న శరభంగ మున్యాశ్రమంబున నేడు వసించి మరునాడు పంచవటీతీరమున ప్రవేశించుమనియా? అటులే చేసెదము. వైదేహీ! తెమ్మ్మ తెమ్మ విరాధుడు సంహరింప బడినాడు భయము లేదు. (తెరబడును)

---

## 2 వ రంగము : పర్ణశాల

[ రామ లక్ష్మణులు సీత ప్రవేశించెదరు ]

రాము—తమ్ముడా! లక్ష్మణ!

చ. అనుపమ సత్ప్రభా విభవ ♦ మైన త్వదీయ ముఖేందు మండలం
బున కదియేల దైన్యదశ ♦ పూనెను తెల్పగదయ్య తమ్ముడా!

వనమున గష్టములొందఁగ ♦ భారమటంచు దలంచినావొ ! నీ
జనని నిజత్నివిన్ గనఁగ ♦ స్వాంతమునందున బ్రీతిపుట్టెనో !

లక్ష్మ—అన్నయ్యా ! మీరట్లెన్నటికిని దలంపకూడదు.

ఉ. తల్లియు దండ్రియున్ హితులు ♦ దైవము గుర్వును నీవెకావె నా
కెల్ల విధంబులన్ వగవ ♦ నేల ప్రమాదము చేత దాపసిన్
ద్రెళ్ళఁగ జేసి యీకరణి ♦ దీనత మీదరి జేరినాఁడనా
యుల్లము తల్లడంపడక ♦ యుండఁగ శాంతిని జేయవేడెదన్.

రామ—ఏమీ ! తాపసినే త్రుంచితివా ! మనవంశసంభవుల యెంత రాత్రి యట్టియనార్యకార్యముల కెన్నడును సిద్ధపడవే ! అది యెట్లుజరిగెను !

లక్ష్మ—పర్ణశాలకై కట్టెల నరుకుచుండ నొకవిప్రవటువు వచ్చి యా పొదలో వ్రేలుచుండు చంద్రాయుధమును గైకొని ఆ పొదను నరుకుమన నరికితిని. అందొక తాపసియుండుటచే నతఁడును నా వ్రేటునకు ఖండింపబడినాడు. చెప్పిన విప్రుఁడు పారిపోయినాడు.

రాము—వత్సా ! భయపడకుము మునిజను లనార్య కార్యముల కెన్నడును బురికొల్పరు. వాడెవ్వడో రాక్షసుడే కావచ్చును.

శూర్పణఖ—(అందకత్తెయై ప్రవేశించి) తాపసవేసమున దపమాచరించు నాకొడుకును జంబుకుమారుని యీ లక్ష్మణుఁడు వధించినాడని కోపముతో వీనిని మ్రింగివేయవచ్చితినిగాని వీనియన్న రాముని జూచుటతోడనే కన్నకొడుకును జంపినారన్న అహంకారము పోయి కామాంధకారము హెచ్చె. వికృతాకారముతో వచ్చిన రాముఁడు నన్ను వరింపడని మిక్కిలి అందముగల అచ్చరవంటిదాననై వచ్చితిని. సమీపించి మాట్లాడెదనుగాక

(ప్రకాశము.) ఓహో! రామమూర్తీ! నీకు స్వాగతము లర్పించుచున్నాను. రక్షింపుము.

రాము—ఓ కాంతా! నీకు శుభంబగుగాక, నీ వెవ్వరిదానవు?

శూర్ప—రాజపుత్రా! ధర్మముల నెఱింగియు రక్షింపుమని శరణు జొచ్చిన దానికి ముందుగ నభయంబీక వృత్తాంతమడుగుట పాడియా! రక్షింపుమన్న నాదీనవాక్యము నప్పుడే తువ్వలచే మేసితివా!

రాము—అబలా శిరోమణీ! రక్షించుటకేకదా నీ వెవ్వతెవనియు నాపద యేదియనియు నడిగితిని? కావున వేగ జెప్పుము.

శూర్ప—తెలిపెదను కాని యూమె నీకేమి కావలయును?

లక్ష్మ—ఓహో! భామినీ ఆ యంశము నీకేల? నీవు వచ్చినపని చెప్పి కొనుము.

శూర్ప—(అసూయతోఁజూచి) ఓయీ! నీ మొగమున బ్రహ్మహత్యా దోషము తాండవమాడుచున్నది. నీవు పాపాత్మునివలె గను పట్టుచున్నావు, నీతో మాట్లాడరాదు. ఆవలనుండుము.

లక్ష్మ—(భయముతో) అక్కట! నిజము కాముకద!

రామ—కాంతా! వానిదోషముల నీవు గణింపబోక నీకార్యమేదో తెలుపుము.

శూర్ప—రామచంద్రా! నాకార్యమేదో నేను తెలుపవలయునా! నీకు దెలియదా? రసికుడవు కావా?

రామ—(తనలో) ఔరా! ఏమీ దీనివాక్యములు భావపూరితము లుగ నున్నవే! కాముకురాలు కాదు కద! అయిన నడిగె దను. (ప్రకాశము) కాంతా! నీయభిప్రాయము నాకు దెలి యదు. నీవే చెప్పుము.

శూర్ప—గీ. భూప! నాసాటి యువమాన ♦ మోహనాంగి
భువన మోహనుడగు నీవు ♦ పొంతజేర
నేమి కారణమో ♦ వచియింప వలెనె
అదియె యని నీకు తెలియునా ♦ మదనమూర్తి!

లక్ష్మ—సరిసరి యింక జెప్పనవసరము లేదు. అన్నయ్యా! యిదివరకు చేసిన బ్రహ్మహత్యలతో బాటు బ్రాహ్మణీహత్యగూడ జేసెదను కలవిమ్ము.

శూర్ప—నీవందులకు దగినవాడవని నేను మున్నే యెరుంగుదును.

లక్ష్మ—ఏమెరుంగుదువు ?

శూర్ప—నాకుమారుని జంపినవాడవని.

రాము—నీ వెవ్వతెవు?

శూర్ప—నేను రావణుని సోదరిని, శూర్పణఖయనుదానను.

లక్ష్మ—ఓహో అలాగువా? అట్లైన నీకు మేము శత్రువులము కదా! మా అన్నగారి నెందులకై శరణంటివి?

శూర్ప—రక్షింతునని యభయం బిచ్చెఁగదా చెప్పునది ఏమి రామ! నాకభయప్రదానము మాట యేమి చెప్పితివి?

రాము—నీయాపద యేదో తెలుపుము.

శూర్ప—ఓహో ఎంతగడుసువాడవయ్యా! ఆమాట అడుదానవైన నానోట బలికింప దలచితివా పోనిమ్ము సిగ్గువిడచి నేనే చెప్పెదను.

చ. వనజదళాక్ష నాయవయ ♦ వంబులుపొంగ శరీరమంతటన్
గొనకొన పుల్కలుం బొడమ ♦ గోర్కులు నీమెడ బ్రాకజొచ్చెబి
గ్గన ననుగౌగలించుము వి ♦ కారమడంచుము కామరూపినై
యనయము మేలుగూర్చెద కృ ♦ పాకర సందియమందకుండగన్

లక్ష్మ—ఛీఛీ! పాపిష్టురాల! స్త్రీవగుటచే బ్రతికిపోతివి.

శూర్ప—ఓయీ! యీరామునియందు నాకు మోహముదవుటచే నాజంబుకుమారుని నీవు చంపినను నీవు నానుండి బ్రతికిపోతివి. ఎట్లైన రాముని నావశము జేసికొని నీభరతము పట్టించెదను.

లక్ష్మ—ఏమే పాపిని! యిదేనిన్ను జంపెదను. (కత్తిదూయును)

రాము—తమ్ముడా! విరహార్తను చంపరాదోయి.

శూర్ప—రామచంద్ర! యిప్పటికి నామీద కరుణవచ్చినదా! యిక నీభార్య నవలకు దోలివేయుము. నాకున్న యందమున నీమెకు నూరవవంతైన లేదు సుమీ!

సీత—ఓసీ సిగ్గుమాలినదానా! అప్పుడే యెంత లేనిమాటలాడుచుంటివే.

శూర్ప—రామమూర్తి! నీవంటి మగనిని గట్టుకొని గౌరవములేక నీభార్య యెట్లునోరు చేసికొనుచున్నదో చూచితివా!

రాము—శూర్పణఖా! నేను భార్యతో వచ్చినాడ. నీవునాకవసరము లేదు. నీవుపోయి లక్ష్మణుని వేడుకొనుము.

శూర్ప—ఇసీ! నీవంటి మగవాడొద్దైన నుండెనా రామయ్యా! వలచి పైబడ నావలన కాదన్నవాని నిన్నే జూచితినిగాని మరెవ్వరును లేరు. అట్లయిన లక్ష్మణునే యడిగెదను. లక్ష్మణమూర్తీ నన్ను మీఅన్నగారేలుకొమ్మన్నారు. ఏమంటివి?

లక్ష్మ—నావలన కాదు. ఆయనపాదములనే బడుము.

శూర్ప—అతడైన సవతిపోరున్నదయ్యా! నీకు మంచిలబ్ధికలుగజేసెదను సుమీ.

లక్ష్మ—ఇక నొక్కసారి ప్రేలితివేని యీకత్తిచే నీకండలుకోసెదను.

శూర్ప—ఈతని వెంటి నూరేకారపుబాలెక్కువ (రామునిసమీపించి) రామమూర్తీ! నిన్నే యేలుకొనుమని చెప్పినాడు.

రాము—నావలన కా దావలకు బొమ్ము.

శూర్ప—ఆ! ఏమనుచున్నావు! నాఅంతదానినే నిరాకరించితివిగా! మంచిది. యీపిల్ల నీచెంతనుండబట్టి నామాట త్రోచివైచు చున్నావు కాన దీనినిమ్రింగివైచెదను. అలలలా (నోరుతెరచి సీతమీదికి బోవును)

రాము—(శూర్పణఖ శిఖబట్టుకొని) తమ్ముడా! దీనికి నాసికాలంకారమునుజేసి పంపుము. (సమర్పించును)

లక్ష్మ—(శూర్పణఖ ముక్కు గోసిపంపును)

శూర్ప—(వికృతాకారముతోవచ్చి) హా చచ్చితినిరా దురాత్మా! హాసోదరులార! హా ఖరదూషణాది రాక్షసులార యీ రాజాధముండు నాముక్కు జెవులు గోసి పరాభవించినాడురా! వేగ వచ్చి వీరిని జంపుడు. రక్తముద్రావుడు. అయ్యో నాముక్కు రక్తము నేనేద్రావుచుంటినిరా వేగరండు. వీరలబరిమార్పుడు. ఓమదాంధులార! మిమ్మిప్పుడేమి చేసెదనో చూడుడు.

(నిష్క్రమించును)

రాము—దేవీ! నీవు పర్ణశాలలోనికిం బొమ్ము రాక్షసులిప్పుడుసమర మునకై గాసై యున్నవారు.

సీత—చిత్తము నాథా! బహుభద్రము సుడీ (నిష్క్రమించును)

[ఖరుడు దూషణుడు ప్రవేశించెదరు]

ఖరు—అలలలల్లా! అరే! మానవాధములారా.

శా. అక్షీణప్రతిభా వివేకముననే ♦ వ్య శ్రేణి సర్జించిఫా
లాక్షాగ్నిచ్ఛటలైన నార్పగల ద ♦ ర్పాధిక్యతన్ మించుమా
రక్షశ్రేణి సహోదరీమణికి ♦ గర్ణచ్ఛేదమున్ మానవా
ధ్యక్షుండెవ్వడొ చేసె వాని నిదె ♦ విధ్వంసంబు గావించెదన్.

దూష—ఓరోరి నరకీటకములారా! రండు మా హేతిఘాతలకు బలి కండు. ఓహో! మాకశనంబుగ నుపకరించు మానవులకు నేడు అరచేత బొడ్లు మొలచినవే! రండు.

రాము—ఓరోరి రాక్షసాధములార! యిదే నా బాణాగ్ని కాహుతి యగుచున్నారు. (బాణముల విడువ జత్తురు. (తెరపడును)

---

## ౩ వ రంగము : రావణుని సభాభవనము

[ రావణ ప్రహస్తులు ప్రవేశించెదరు ]

రావణ—ప్రహస్తా! మనకు గాలమేమో వ్యతిరిక్తముగ నున్నట్లు తోచుచున్నదోయి. ఏమందువా! మానవ మాత్రుడైన యొక్క నరాధముండు.

గీ. తాటకనుగూల్చి కౌశికా ♦ ధ్వరవిఘంగు
తాసుబాహుమారీచుల ♦ నడచె నప్పు
డది మొదలు నాదుమదిని ♦ శల్యంబుకరణి
మెఱుఁగుచున్నాడు ప్రా ♦ రబ్ధమేమొ మంత్రి.

ప్రహ—స్వామీ! రాక్షసచక్రవర్తివైన నీవే యిట్టి యర్థోక్తుల నాడిన మాంబోట్ల గతియేమి?

శూర్ప—(ప్రవేశించి) హా అన్నయ్యా! నీవంటివానికి జెల్లెలనై యొక్క నరాధమునిచే ముక్కు జెవులు గోయబడి పరాభవింపబడ నీవూరక చూచుచుందువా! ఆయ్యో! అమ్మరో; చచ్చితినర్రో.

రావ—(ఆశ్చర్యముతో) ఏమీ! చెల్లెలా! నీ ముక్కు గోసిన దురాత్ముండెవ్వండే?

శూర్ప—హా సహోదరా! రామలక్ష్మణులట, దశరథుని పుత్రులట. పంచవటీతీరమున బర్ణశాల నిర్మించుకొని యున్నారు.

నా వికృతాకారమును జూచి ఓసీ యిటురమ్మని నాముక్కు చెవులురా గోసినాడురా తండ్రీ. అయ్యో నా రక్తము నేనే త్రాగుచున్నాను అన్నా!

రావ—చెల్లెలా! మఱి ఖరుడు వారిని సంహరింప కూడుకొనెనా!

శూర్ప—అయ్యో! నా యేడ్పు విని వచ్చి వానిపై కేగి వాడును చచ్చినాడురా!

రావ—దూషణుడేమయ్యెనే! త్రిశిరస్కుడు మొదలగు పదునాల్గు కోట్లరక్కసు లెందరిగినారు?

శూర్ప—అయ్యో! వారందరు ఖరుని యనుసరించి యమపురికే పోయినారురా. జనస్థానమంతయు రాక్షసశూన్యమై పోయినదిరా.

రావ—హా! సహోదరులార! ఖరదూషణాది రాక్షసవీరులార!

గీ. బంతులపిధాన బ్ర ♦ హ్మాండ భాండములను
బట్టి యాడగనట్టి ♦ దోర్బలములు కలిగి
నట్టి మీరెల్ల నిపుడొక్క ♦ యల్పమనుజు
డక్కటా మృత్యువయ్యెనే ♦ యనుజులార.

ప్రహస్తా! మనకింతకంటె క్రోధ కారణము లేదు. కావున సమర సన్నాహమును గావింతము.

శూర్ప—అన్నయ్యా! నేనొక్క యుపాయమును జెప్పెద వినుము. ఆ రాముని యెదుట రణము సేయ రుద్రాదులకైన వశము కాదు. వానికి సీతయను భార్య కలదు ఆమె త్రిభువనసుందరి ఆమె నెటులో నీవు సంగ్రహించితివేని యా విచారముచేత వాడు స్వయముగ ప్రాణముల బాయగలడు. పాయకున్నను నిస్తేజుడై నీచేత జచ్చును. ఆమె నీకు దక్కును.

రావ—బళే!! సహోదరీ! చక్కని యుపాయమును జెప్పితివి శే! అటులే చేసెద. నీవుపోయి నాసికా కర్ణములకు మందు వేసికొనుము.

గా—.

శూర్ప—అటులే పోయెదను కాని పాపాత్ముడైనచో రాముని రెక్కలు
విరచికట్టి నాకప్పగించితివేని నాకసి తీర్చుకొనెదను.

రావ—అటులే చేసెదను శీఘ్రము పొమ్ము.

శూర్ప—మంచిది (నడచుచు తనలో) నాకారాముడే చిక్కిన
నెట్లో నాకోరిక తీర్చుకొందును.

(నిష్క్రమించును)

రావ—మంత్రీ ప్రహస్తా మాయాకల్పనల యందసమాన ప్రజ్ఞకలిగిన
మారీచుని సహాయముగాని సీతనపహరించుటకు వీలులేదు,
కావున మారీచునిచటకే పిలువుము (ధ్యానమభినయించును)

ప్రహ—చిత్తము.

మారీచుడు—(జటావల్కలములతో ప్రవేశించును)

రావ—మాతులా మారీచా ? యిటుకూర్చుండుము.

ఉ. వింటివె ! దూషణాద్యసు ♦ రవీరులు రాముని చేత గ్రుస్సుటల్
కంటివె ! నా సహోదరికి ♦ కర్ణము నాసికయు గోసినారు నీ
వంటి సహాయకారకుడు ధ్రు ♦ వంబుగ నాకిక లేడు చూడవా
ల్గంటిని వాని భార్యను చ ♦ లంబున దస్కరణంబు సేయగా.

కావున నిందులకేదియో యుపాయము చెప్పి నాపగదీర్పుము:

మారీ—అక్కటా ! భాగినేయ! నీవు చేచేతల మృత్యువు నోటఁ దల
బెట్టజూచుచున్నావు! సుమీ యేమందువా!

ఉ. ఈయఖిలప్రపంచమున ♦ కీశ్వరుడై తన రాదనట్టి నా
రాయణమూర్తియే రిపువి ♦ రాముడు రాముడనంగ మానవుం
డేయగరాదు వానినని యెంత ♦ యు డీకొనశక్యమా నె ! దై
తేయులదృంప ధాత్రిదని ♦ యించెదటంచు నతిర్తురెల్లరున్.

అంతియె కాక కౌశికుని యజ్ఞభంగము చేసెడు నట్టివ
న్నొక్కకోలచే నన్ను సముద్రమధ్యమున బడవైచి సుబాహుల్లాదుల

వంశరనొక్క బాణమున సంహరించెను. ఆమహాత్ముని పరాక్ర మాగ్నికి నిడుతనై యది మొదలు రామయను శబ్దము నుచ్చరిం చక భయముతో బ్రాణముల బిగికిలించుకొని తపోవృత్తిని గాల క్షేపము సేయుచుంటిని. కావున నట్టివానిపై గట్టలుకబూని వంచనో పాయము నాలోచించుట మృత్యువునోట దలపెట్టుటయని తలం చుము అదియుగాక నీయంతవారు ఖరదూషణాదులా రామశరాగ్నికి భస్మమైపోయినారు. నీవు వివేకవంతుడవైతివేని యీరామాగ్ని లంకవరకు బ్రజ్వరిల్లకుండ జేసికొని యుక్తిగా బ్రతుకుము.

రావ—ఏమీ మామా! పెద్దవాడవని నీతో నాలోచించినందులకు నాకిదియా! చెప్పుచున్నావు. నామాటలను వినుము.

శా. మాయాకల్పనలందు మేటివిగదా ♦ మామా కురంగంబవై
యాబ్జాక్షిమనంబు మోహపడజే ♦ యన్ రాముడద్దానికై
పోయిన్ సీతను లక్ష్మణాఖ్యునుచు బి ♦ ల్వన్ వాడునుంబోవునే
నోయత్యాకృతి నామెగైకొనెద నీ యుక్తిన్ సమర్థింపుమా.

నీవు ప్రాణములు పోవునేమోయని నామాట నిరాకరించితి వేని నాచేతనైన నీకుమరణము సిద్ధము. నాకీ యుపకారమును జేసితి వేని మనకులముపై నభిమానమున్నదని తలంచెదను. ఏమిచెప్పెదవు.

మారీ—(తనలో) ఎటులైననాకు మరణము తప్పదు. యీదుష్టుని చేత జచ్చుటకంటె భగవంతుడైని రామునిచే జచ్చిన మోక్షము కలదు. (ప్రకాశము) భాగినేయా నీవుచెప్పినట్లే చేసెద నీవు నీయుద్యమమున నుండుము.

రావ—మంచిది వేగబొమ్ము.

(అందరు నిష్క్రమించెదరు)

## 4 వ రంగము : పర్ణశాల

[రామలక్ష్మణులు సీత ప్రవేశించెదరు]

రాము—లక్ష్మణా! యిక్కడికి ప్రాంతమునయున్న ఖరదూషణాది రాక్షసులెల్లరును సమసిరని తలంచెదను.

లక్ష్మ—రక్కసులు మాయావులుకదా! మనమెట్లు నిర్ణయింపగలము?

సీత—ప్రాణేశ్వరా! అటుచూడుడు,

చ. కనుగవ నింద్రనీలముల ♦ కాంతులు రంజిల దారలట్లు లా
కనకపు మేనచుక్కలుం వి ♦ కాస మెలర్పగ గ్రేళ్ళుదాటుచున్
తృణలతి మేయుచున్నదల ♦ దేరి కనుంగొను లేడిపిల్ల నా
మనసు హరింపజొచ్చెగను ♦ మా! యదెదానినిదెచ్చియీయుడీ.

జీవితేశ్వరా! నే నద్దానిని గారాబముగ బెంచికొనుచు గాలక్షేపము చేసెదను.

రాము—ప్రియురాలా!

మ. రమణీ! యేలభ్రమింతువా కనక సా ♦ రంగంబు చేష్టావిలా
సములన్ జూడ సురాదులం దెవశో యా ♦ సల్లోల్పివంచింప ని
క్కముగా నీగతివచ్చెనంచు దలతున్ ♦ గంజాక్షి! యాలేడికై
భ్రమలన్బొందకు మాయరాక్షసుల చ ♦ ర్యల్ నమ్మగావచ్చునే.

లక్ష్మ—అమ్మా! అన్నగారిమాటసత్యము, నీవాసారంగమునుజూచి భ్రమింపకుము.

సీత—నాథా! మీరట్లనిన నేనేమందును?

శా. కాలక్షేపము లేక బెగ్గడిలి యా ♦ కళ్యాణ సారంగపున్
లీలన్ జూచుచు బ్రొద్దుపుచ్చుటకు నీ ♦ లీల౯ మిమున్ గోర నో
బాలా! రాక్షసమాయలంచు బలుకన్ ♦ భావ్యంబె మైదాల్పహా
శాలా! ఆభరణంబులా మృగము గోరన్ ♦ బెద్ద రాద్ధాంతమా

రాము—(తనలో) ఓహో ఆడువారి చెప్పుడుమాటలు శూలపుంబో టుల మించును. (ప్రకాశము) ప్రాణేశ్వరీ! ఆగ్రహింపకుము. చేతికిజిక్కి సదోడి తెచ్చుటకు లేకున్న గోలుకూల్చియైన నాలేడిని నీకు దెచ్చియిచ్చెద. లక్ష్మణా! యిక పోవక తీరదు. నీవు బహు భద్రముగ జానకిని గాచికొని యుండుము.

లక్ష్మ—అన్నయ్యా! అటులే పోయిరండు.

రాము—(నిష్క్రమించును)

లక్ష్మ—తల్లీ! ఆ లేడి తప్పక రాక్షసమాయానిర్మితమే సుమి!

ఉ. నమ్మక యుంటినమ్మ రఘు ♦ నాథుని వాక్యము సుంతయైన ద
ధ్యమ్ముగ బాంధవ్రల్ మరణ ♦ మందగ క్రోధపరీత చిత్తుడై
యిమ్మెయి మోసపుచ్చ దను ♦ జేశ్వరుడెవ్వడో! వచ్చుజుమ్మి శీ
ఘ్రమ్ముగ నిందువమ్మ రఘు ♦ రాముని చేత దదీయవృత్తమున్.

సీత—లక్ష్మణా! నీ వా రామచంద్రుని యనుజుడవు కావా! ఆయన పాదమునే పర్ణించుటకు నేనా బంగారులేడి నెత్తికొని యాడు నపుడైన మాసదిసగారమాటయే నిజమని తలంపకుందువా? (తెరలో) హా లక్ష్మణా! హాతోస్మి హాతోస్మి.

ఇద్దరు—(ఆశ్చర్యమభినయించెదరు)

సీత—అయ్యో! లక్ష్మణా! ఆవాక్యంబులు మీయన్నగారివి కావా! ఆమహాత్మునకేదో ఆపదమూడినట్లు తోచుచున్నది నాయనా! వేవేగబోయి మీయన్నగారినిరక్షించితోడ్కొని రాగదవోయి.

లక్ష్మ—తల్లీ! భయపడకుము.

మ. ధరణీచక్రము తారుమారయిన దై ♦ త్యశ్రేణులున్ దివ్యులున్
భరమానట్లొకసారి పైబడిన శుం ♦ భద్బాహు దర్పంబునన్
శరవారంబున గూల్చుగాని యొకట లే ♦ శంబైన భీతిల్లునే
సిరచిత్తంబున నుండుమమ్మ మృగమ ♦ ర్దిన్దెచ్చి నీకిచ్చెదన్.

సీత—

మ. అయయెూ లక్ష్మణ! నీమి యిట్లు నెకపాంపాలక్ష్మణా! పాపాతో
స్మియటంచున్ గను దీనుడై యుండ గా ♦ సింహమైన నీయన్నపై
దయలేకుండగ భీతి జేసుచు భ్రా ♦ తన్ బ్రోవ బోవైతి నీ
నయబుద్ధిన్ గపటాగ్ని గాల్చితివె!♦యన్యాయంబుగా నీవెుసన్.

అక్కటా! నీవిట్టివాడవని గలనైన నెఱుంగకపోతిని కదా! నీయన్నగారియందలి భక్తియంతయు నీ నిముషముతో గంగ గలిపితివా?

లక్ష్మ—తల్లీ! క్షమించుము నామాటవినుము. అగ్నిసాక్షిగ మా వంశకర్తయైన ప్రభాకరుని సాక్షిగ నాయన్నగారి యెడల నాకు గపటబుద్ధి లేదు.

ఉ. చేతికి లేడి చిక్కమి వి ♦ శేషశ్రమంబును బొంది నిస్పృహాన్
శాతశిలీముఖంబు నర ♦ నాస్థలి గూల్పగ మోసబుచ్చగా
నాతరినట్టులార్చెను సు ♦ రారి యొకండిది నిక్కువంబుత
ల్లీ! తపియింపకమ్మ తర♦లింతురు నిన్ను త్యజించి పోయినన్.

కావున నిన్ను నేనువిడచి పోవరాదు. కొంచెమోర్చితివేని మాయన్నయే రాగలడు.

సీత—ఓరీలక్ష్మణ! పరోముఖ విషకుంభమ! దైవజ్ఞ శిఖామణి వలె నెట్లుపన్యసించితివిరా!

చ. వనముల నన్నగారు రిపు ♦ బారికి లోనయి గూలనుండగా
ననునిట భార్యగాగొని య ♦ నంత సుఖంబుల గాంచనెంచితే
చెనటి! మదీయదేహమును ♦ జీల్చినగాని నినున్ భజింతు నం
చని తలపంగబోకు ఖలుడా! ♦ యిక నీ మది తెల్లమయ్యెరా!

లక్ష్మ—శివశివా! (చెవులు మూసికొని) అన్నన్నా! ఎట్టిమాటలు వినవలసివచ్చెను దైవమా! పాపము శమించుగాక.

ఉ. తల్లివి కావటమ్మ గుణ ♦ ధాముడు రాముడు తండ్రి కాడె నం
పల్లవితాంగి! దౌష్ట్యము ల ♦ వంబును నాయెడ లేదు దానవుల్

కల్లలువల్కి సత్యమని ♦ కానలనొంటిగ నిన్నువీడి నే
మెల్లన బోవ రాక్షసులు ♦ గ్రమ్మింగరె! రాముడు నన్ను సైచునే.

సీత—ఛీ దురాత్మా! అవిధంబుగ నన్నగారు వచ్చితినిరా లక్ష్మణా యని యరువగా నీవో ధర్మపన్నములు చెప్పవచ్చితివా? నీపాడుబుద్ధి తెలిసెనులే. నేనేపోయి నానాథుని రక్షించుకొనెదనులే. (వెడలబోవును)

లక్ష్మ—తల్లీ! త్వరపడకుము. నీవీపర్ణశాల విడచి యీవలకు రాకుము. నేనిప్పుడే పోయి నాయన్నగారిని దోడ్కొని వచ్చెదను.

సీత—అటులైన వేగబొమ్ము.

లక్ష్మ—ఈవైదేహి కేయాపదయు రాకుండ వనస్పతులకు నప్పగించెదను గాక.

సీ. ఓవనస్పతులార! ♦ యోనగేంద్రములార!
రక్షించుచుండరే ♦ రాముదేవి
కులదైవతములార ♦ గురువరోత్తములార
కావరే యీసీత ♦ గానసముల
పంచభూతములార ♦ ప్రథితగ్రహములార
దయజూచుచుండరే ♦ ధరణిజాత
వనవాసరతులార ♦ ఘనతపోయుతులార
అరయుచుండరె రాము ♦ తరుణినిచట

గీ. రఘుకులోదధి చంద్రుడౌ ♦ రామచంద్రు
నరయబోవుచు నున్నాడ ♦ నంతవరకు
నీమె రక్షించుచుండరే ♦ ప్రేమమీర
అఖిల దేవతలార ♦ మహాత్ములార.

తల్లీ! యీ హద్దుదాటి యీవలకు రాకుము.

(నిష్క్రమించును)

రావణుడు—(యతివేషముతో ప్రవేశించి) జయశంకర! మహాదేవ!

సీత—(తనలో) అక్కటా! యీ యకస్మాదాగతుండగు పరివ్రాజకుడెవ్వడు చెప్మా! నా మరది చెప్పినట్లు రాక్షసుడీ వేషమున వచ్చి యుండలేదు కదా? అయినను నిచ్చటికేతెంచినయీ స్వాగత మిచ్చెదను. (ప్రకాశముగ) మహాత్మా! యీ దాసురాలి స్వాగతము గైకొని యుచ్చాసనంబు దయసేయుడు.

రావ—ఓహో! సాధ్వీ! నీ భక్తికి మెచ్చితిని ఆయుష్మతివి కమ్ము.

ఉ. ఎవ్వరిపుత్రివీవు హృదయేశ్వరు డెవ్వఁడు కాననస్థలిన్
మవ్వపుమేనికాంతి నన ♦ మానవిభాసను వెల్గఁజేసి నీ
యివ్వనభూమి నొంటి జరి ♦ యించఁగ నేమికతంబొ! చెప్పుమా
జవ్వని! భీకరాటవుల ♦ జానలు సంచరణంబు సేతురే.

సీత—మహాత్మా! ఇక్ష్వాకుకుల తిలకుఁడైన దశరథ మహీపాలుని కోడలను; జనక రాజ పుత్రికను, శ్రీరామచంద్రు నిల్లాలిని, పితరుల యాజ్ఞచే తమ్ముఁడైన లక్ష్మణుని నన్నుఁ దోడ్కొని యరణ్యవాసమునకై వచ్చి నానాథుండీ పంచవటీతీరమున వసించుచు నిప్పుడే యొక లేడిపిల్లను బట్టుటకై సమీపమునకు బోయియున్నవాఁడు.

రావ—ఓహో ఆలాగునా! నీవే నా సీతవు? అక్కటా! నిపత్కృష్ట హీనురాలవు కదా.

సీత—మహాత్మా! ఏమి అట్లనుచున్నారు? నా నాథునకు సేమమా?

రావ—కళ్యాణీ! సేమ మెట్లు కలుగును పిచ్చిదానా!

చ. మతిచెడి తండ్రి పొమ్మనిన ♦ మాత్రన రాజ్యము భ్రాతకిచ్చి యీ
గతి గడు క్రూరజంతువుల ♦ గానల బుష్పశరీర నిన్ను బల్
వెతలను బెట్టు భర్త మగ ♦ వీఁడె! వెంగలి కాక వానికిన్
సతము సుఖంబు కల్గునన స్వప్నము సుమ్ము తలోదరీమణీ.

సీత—అయ్యా! అందులకై కూరకుపురకుడు విచారము లేదు.

రావ—నాకు విచారము లేదనుము. అతని విచార మతనితోడనే పోయెను కదా.

సీత—అక్కట! యతినార్యశ్రేష్ఠా! ఏమి అట్లనుచున్నవారు నా నాథు డెందుబోయెను? వేగ చెప్పుడు.

రావ—చెప్పిన నీవేమి చేయగలవు?

సీత—హా! పూజ్యుడ! యీసందిగ్ధాక్షరములు నన్ను బాధించు వేళ! నానాథు సంగతి జెప్పుడు.

రావ—చెప్పుట కేమున్నది? ఆలేడి చేతికి జిక్కకుండుటచే నీమగడు దాని నొక కోలతో దూలనేయ లేడి మాయమై యొక రాక్షసుడై నీనాథుని బరిమార్చెను.

సీత—హా ప్రాణేశ్వరా! (మూర్ఛిల్లును)

రావ—జానకీ! లెమ్ము లెమ్ము. ఏల విలపించెదవు.

సీత—హా మనోవల్లభా! హా నాథ! యతివర్యా! మా లక్ష్మణుం డన్నగారిని రక్షింపరాలేదా!

రావ—సీతా!

చ. శరమున లేడిగూల్పగ నె ♦ చయ్యన రాక్షసరూపుడై భయం
కరముగ నీపతిన్బొదువగా ♦ వడి లక్ష్మణ! హా హతోస్మియం
చురువడి నార్చిచచ్చె నపు ♦ డొయ్యన లక్ష్మణు డేగుదెంచి నీ
వరుని యవస్థగాంచి తన ♦ ప్రాణములన్ విడనాడె దుఃఖియై.

సీత—హా హా మనోహర! హా లక్ష్మణ! మీ యిరువురి ప్రాణముల దీయుటకు నేను మృత్యువునైతినా!

ఉ. హా జగదేకసుందర! మహా ♦ సుహితాన్విత రామచంద్ర! నీ
కేజహితాన్వయాభరణ! న్ను ♦ త్యువునోటను బెట్టినానె వి

భ్రాజితతేజ! నిత్యాభయ ♦ నల్లక సుఖదుఃఖమహాబ్ధి ముంచితే
యీజనకాత్మజాతకిక ♦ నెవరు దిక్కిటివో దయాకరా!

అక్కటా లక్ష్మణ! నా అన్నగారికి భయము లేదని నీవెంత చెప్పినను వినక పోరి పంపించినందుకు నాకీ పాటు వాటిల్లెను కదా! అన్నన్నా నాకింక నెవరు దిక్కు హా నాథ! హా లక్ష్మణా!

రావ—సీతా విచారింపకుము.

ఉ. చచ్చినవారు నీవరులు ♦ సాక్షి కథంబులు చేసి యేచ్చినన్
వచ్చెదువారు కారు తల ♦ వంచిక యేటికి రాముకంటె నీ
హెచ్చుగజూచి మాళినిక ♦ నేలిక రావెను వెంటరమ్ము నా
సచ్చరితంబు కీర్తివిన ♦ జయ్యన నన్ను ననుగ్రహింపవే.

కావున నీవు శోకముడిగి నావెంటరమ్ము.

సీత—(తనలో) ఓహో యీయతి యొక మాయారాక్షసుడు కావచ్చును. లేకున్న నిట్లు పలుకడు. (ప్రకాశము) ఓరీ కపట యతివేషధారీ! నీవెవ్వండవు!

రావ—నీవు నన్నెరిగెదవని పిలచినను నాకు సంతోషమే సుమీ! నేను పులస్త్య బ్రహ్మవంశ సంజాతుఁడను. రావణుడని యందురు.

చ. పవలున భాస్కరుండు హిమ ♦ భానుడు రేలను నాకుఛత్రముల్
దివిజులు కింకరుల్ సకల ♦ దిక్పతులు న్నాపదపద్మదాస్యకిన్
దవిలి చరించు మామకప్ర ♦ తాపము విన్న భయంబుచేతనీ
భువనములెల్ల గంపిలును ♦ బోటిరో! మాటలు వేయియేటికే.

కావున నీవు నన్ను జేకొంటివేని జగంబులకెల్ల భజనీయురాల వగుదువు.

సీత—ఓరీ దుష్టరావణ! ఏమిరా ప్రేలెదవు?

చ. నక్కయొకండు కందరము ♦ నన్ హరి లేదని దానిమాంసమున్
గ్రక్కున దక్కరించుగతి ♦ రాముడు లేడని పర్ణశాలలో

ప్రముక్కుడి! నన్ను జేకొనకు ♦ బుద్ధినిపట్టితే! నీశిరంబు వే
వ్రక్కలుగా శపించెదను ♦ బాలిక! పట్టిపత్రోవ బట్టుమీ.

ఓరీ మదాంధరాక్షసాధమ! పర్ణశాలలో నాడుదియొక్కతె యున్నది కదా యని తస్కరింపదలంచితివేమొ అట్లు సాగదుసుమీ. నానాథు డిప్పుడేవచ్చి నిన్ను హతమార్పగలడు.

రావ—నీనాథుడింకను వచ్చునని యే చెప్పుచుంటివా? నీ వనాథ వైతివి కదా యని బాలికా నిన్ను స్పృశింపదలచితి నెందుకు బెట్టుసరి చేసెదవు.

శా. ఆలంకాపురి నాసుధాకరమణీ ♦ హాబద్ధసౌధాల, ర
త్నాలంకారిత కాంచనోల్లసిత ప ♦ ర్యంకస్థలిన్ దేవతా
లోలంబాలక లెల్ల చామరములా ♦ లోగస్థితిన్ వీవ నా
తోలంకేశ్వరివై సమస్తసుఖముల్ సం ♦ తోషంబునన్ బొందుమా

సీత—ఓరీ పతివ్రతామానభంగపరాయణ! రావణ! ఏమిరా ప్రేలెదవు!

ఉ. ఆరఘురామచంద్రుని మ ♦ హానిలయాగ్నిని మించు నాశరా
సారపుమంటలొక్కముగి ♦ సత్పథమందున నిండి నిన్ను గం
భీరత నాహరించి పృథి ♦ వీస్థలి గూల్చిననాడు నన్ను ని
ష్కారణ మిట్టులన్న కలు ♦ షంపు ఫలంబును బుద్ధినల్పవో.

కావున బుద్ధిగల్గి యవలకుబొమ్ము.

రావ—శాతోదరీ! నీభర్త నన్నేకూల్చునో నేనే నీమగనినికూల్తునో నీవే చూచెదవుగాక! నానిజరూపమునుజూడుము. (చూపును)

సీత—హా ప్రాణేశ్వరా. (మూర్ఛపడును)

రావ—ఈమెను నారథంబున బెట్టికొని రామాదులు రాకుండ లంకాపురమునకు గొంపోయెదనుగాక.

(తెరపడును నిష్క్రమించును)

5 వ రంగము : అరణ్యము

రాముడు—(ప్రవేశించుచు) అక్కటా! ఏమి కానున్నదో కదా!

గీ. కోలచే లేడి నిలగూల్చ ♦ క్రూరదైత్యు
డాకృతిని దాల్చి హా లక్ష్మ ♦ ణా! హతోస్మి
యనుచు నావలె నరచె హా ♦ యనుజు డాత్మ
నెంత శంకించెనో నాదు ♦ కాంతతోడ.

ఔరా! నా మనస్సు చిన్నబోవుచున్నది ఏమి చెప్పుదూ! (ముందుజూచి) అక్కటా! జానకిని ఒంటరిగ విడిచి లక్ష్మణుండిటకే వచ్చుచున్నాడు కదా!

లక్ష్మ—(ప్రవేశించును)

రాము—తమ్ముడా! వన్యభూమిలో సీత నొంటరిగ విడిచి వచ్చితివా!
అక్కటా! యెంతపని చేసితివిరా!

లక్ష్మ—అన్నయ్యా! హా లక్ష్మణా! హతోస్మియను వాక్యంబుల నాలకించి వైదేహి మీ కాపదగలిగినట్లు శంకించి నన్ను బొమ్మని బలవంతము సేయుచు

చ. దనుజుల మాయ కాని మన ♦ దాశరథిన్ భువి గాదటంచు నెం
తని ప్రతిమాలి చెప్పినను ♦ దా వినదాయె నా నుడులాలకింప కా
జనకజ కిన్కచేత బలు ♦ వంబుల నాడ సహింపలేక యీ
వనముల నిన్ను గోరుచును ♦ వచ్చితినయ్య సహోదరాగ్రణీ.

రాము—ఇదీ తమ్ముడా! ఎంతపని చేసితివోయి!

చ. ఉచితమె! నీకు సీత పరు ♦ షోక్తుల వాడ దురాభిమానివై
సుచరితనామె నొంటి దను ♦ జుల్ చరియించెడు కానలందు ధీ
రచనవొ లంగి వీడుదువె! ♦ రాముడు రాడొకో సీత క్రూరపున్
వచనములెల్ల జంపి వనా! ♦ వత్స! ధరాత్మజ యింక దక్కునే.

లక్ష్మ—స్వామీ! అక్కడ నన్నామె పోరి పంపుటచే వచ్చితిని, క్షమింపుడు. పోయి వెదకుదము రండు. ఇందే యుండగలదు,

(తెరలేవ పర్ణశాల కనబడును)

రాము—(నడచి) హా తమ్ముడా! అదృష్టహీనులము కదా! చూడుము పర్ణశాల యెట్లున్నదో?

ఉ. కాయలు దుళ్ళగొట్టిన వ ♦ గం బన బిల్లలులేనియట్టి వి
ద్యాయతనం బనంగ మిహి ♦ రాంశుని బాసినరాత్రి యట్లు శా
లాయము సీతలేక సిరు ♦ లన్నియడవాడిన పర్ణశాల వ
త్సా! యెటులున్నదో కనుమ ♦ తప్పక ద్రైత్యుల జిక్కియుండెడిన్.

అక్కటా! ఎంతపని చేసితివోయి.

లక్ష్మ—అయ్యో! వైదేహీ (అటునిటువెదకి) తల్లీ జానకీ! హా పాపాత్ముఁడనుకదా? యికనెక్కడిసీత పర్ణశాలలో లేదుకదా!

రాము—(కూలబడి) హా చచ్చితినికదా!

గీ పర్ణశాలను సీత క ♦ న్పడగలేద
టన్న పరుషాక్షరములు నా ♦ యంతరాత్మ
దగులబెట్టగ జొచ్చె వ త్సా! యికేడ
రామునకు సెల్లెనూకలు ♦ భూమిమీఁద.

హా జానకీ! (మూర్ఛబడును)

లక్ష్మ—(రాముని చేరి) హా, యీపుడు రాజున కెంతయవస్థ దెచ్చితిని.

క. అన్నా! ధైర్యము వీడకు
మన్నా! నీయున్నమిన్న ♦ నడవిగలిపె నీ
చిన్నటి యేయెడ జానకి
యున్నదో! రోయక యెదుఃఖ ♦ మొందుట తగునే!

రాము—తమ్ముడా! యికెక్కడి జానకిరా?

ఉ. ఎప్పుడు జానకిన్విడచి ♦ యేత్తెర నాకొఱకీవు వచ్చితో
అప్పుడె క్రూరరాక్షసుల ♦ హస్తమునం బడె బల్మి చేత నే

తిప్పలబెట్టిరో యసుల ♦ దీసిరొ! రక్తము ద్రావినారొ! హా
చెప్పగజాల నాకికను ♦ జీవముతో బనియేల తమ్ముడా!

లక్ష్మ—రామచంద్రా! నీహృదయకుటీరమునకు జిచ్చుముట్టించిన లక్ష్మణహతకు నింక తమ్ముడా యని పిలువకుము. పూజ్యురాలైన వదినగారిని రాక్షసులపాల ద్రోసి అన్నగారికి ప్రాణసంకటము దెచ్చిన మహాపాతకుడను కాని, ఆమె రాక్షసులవాతనే చిక్కెనో క్రూరమృగంబులే హరించినవో పరీక్షించిన వెనుక మన మిరువురమును ప్రాణత్యాగమును జేసికొందుము, కావున వెదకుదము రమ్ము.

రాము—వత్సా! అటులైన లెమ్ము అనుభవనీయమిట్లుండ మనమెందులకు కర్తలము కాము; కావున నడచి యరణ్యమున బరీక్షింతము.

లక్ష్మ—(పరీక్షించి) అన్నయ్యా, యీపర్ణశాలనుండి జానకి యేగిన పదచిహ్నములు కానరావు. ఇందుమాత్ర మొక పురుషుని పదముద్ర లగపడుచున్నవి, కానివాడును మరలిపోయిన చరణ సరణియు గానవచ్చుట లేదు యేమిచిత్రమో తెలియకున్నది కాదా.

రాము—(చూచి) హా ప్రియురాలా! వైదేహీ!

ఆ. వె. దివికి నెగసినావొ ♦ భువిదూరిపోయితో
తెలియరాదు నీదు ♦ తెరవుసుంత
నామనంబు కనుగొ ♦ నంగనంతర్హిత
వై వనాళినడగి ♦ నావొ చెలియ!

లక్ష్మ—ఇదికడు విచిత్రముగనున్నది. అన్నా యీప్రాంతమంత వెదకుదము రమ్ము. (ఇద్దరు నిష్క్రమింతురు)

6 రంగము—పసాంతరము

రాము—హా వైదేహీ! ఎందుబోయితివి? ఎచటనుంటివి? ఓ మృగంబులారా!

సీ. కానవా కలకంఠ ♦ కలకంఠి నాభార్య
నరసితే హరిణమా ♦ హరిణనేత్రి
పికమ చూడగలేదె ♦ పికవాణి నాప్రియ
కలభమా కాంచితే ♦ కలభగమన
తిలకసుందరఫాల ♦ తిలకమా చూచితే
హరిమధ్యగానవే ♦ హరివరంబ
పాటలా కంటివే ♦ పాటలాధరి సీత
భ్రమర వీక్షించితే ♦ భ్రమరచికుర
గీ. సాలహింతాల కుటజర ♦ సాలులార
నామనోహరిసీత ♦ గన్నారె మీరు
అక్కటా! యింకనెక్కడి ♦ యువనిజాత
రామ జీవితమింక ♦ నిరాశయయ్యె.

లక్ష్మ—అన్నయ్యా! యిందు వెదకుదము రమ్ము. (నడతురు)

రాము—హా! జనకరాజనందనీ! నీ చందము నీయందము నాకనుల కొకసారి చూపి యానందంబొసగరాదా! నేనేమి పాపము జేసితిని?

ఉ. చిక్కులబెట్టనెంచి వన ♦ సీమలనెందుల దాగినావొ హా
చక్కరబొమ్మ నీవు నర ♦ సన్ వహియింపగ గందమూలముల్
చక్కని పిండివంటలగు సాధ్విరొ ♦ దర్భలె తూలతల్పమా
రక్కసదొంకలున్న వన ♦ రాజ మయోధ్యయె సుమ్ము జానకీ,
హా జానకీ! దయయుంచి యొకసారి నీ సందర్శనంబీయవా!

లక్ష్మ—ఆహా! మా యన్నగారి కెంత దురవస్థను దెచ్చితివి దైవమా!

రాము—హా నిర్మల వదన చంద్రికా!

గీ. నళినదళనేత్ర! నిను బాసి ♦ నారికేరి
చాపమున చంద్రికం బలేని ♦ చంద్రుఁ డనఁగ
తేజ మెడలిన రవిభాతి ♦ దీనదశను
బొందియున్నాఁడ సుమ్మి రా ♦ కేందువదన.

లక్ష్మ—అన్నయ్యా! ఆ మహాసాధ్వి వియోగము జగములకే దుర్దశను గలిగింప మనకు దీనదశయుండుట ఆశ్చర్యమా! నడువుము ముందు జూచెదము.

రాము—(నడచిచూచి) తమ్ముఁడా!

సీ. ఏకొండరా! యిది ♦ యింత దుర్గమం బయ్యె

లక్ష్మ— కొండ కాదయ్య కా ♦ క్షత్త్రతిలక

రాము— కాకేమిరా! కండ్ల ♦ గట్టినట్టులదోఁచె

లక్ష్మ— రఘురామ! దండకా ♦ రణ్యసీమ

రాము— వత్స! యిందేటికి ♦ వచ్చితి మెఱిఁగింపు

లక్ష్మ— గురురాజ్ఞ వచనముల ♦ దీర్చఁగాను

రాము— వనుల ద్రిమ్మఁగ నె ♦ వ్వరము వచ్చితిమన్న

లక్ష్మ— నీవును సీతయు ♦ నేను గాదె

రాము—గీ. సీత లేదేమిరా మన ♦ చెంత వత్స!

లక్ష్మ— పర్ణశాలను దనుజుల ♦ పాలబడదె

రాము— హా మనోహారి! హాసీత ♦ హామదీయ
ప్రాణమా! జానకీ! నన్ను ♦ బాసినావె

లక్ష్మ—అక్కటా! మా అన్నగారి కంతకంతకు మతిపోవుచున్నదే! యేమిదిక్కుదైవమా!

రాము—(త్వరలో) తమ్ముడా! తమ్ముడ! అదిగోరా! సీత కనబడినది.

లక్ష్మ—అన్నా! ఏదీ? యెచ్చట?

రాము—అదిగో, ఆవైపు జూడుమా!

సీ. కనకచేలముగట్టి ♦ వనజాక్షి చరణముల్
ముడిచికూర్చుండె న ♦ య్యేడనుగనుము

లక్ష్మ—శ్రీరామ! విరియబూ ♦ చిన రేలపొదకాని
జానకి కాదు ని ♦ శ్చలతగనుము

రాము—ముఖమండలంబదే ♦ మోకాళ్ళపై నాని
మనవైపు నవ్వుతో ♦ గనుట లేదె

లక్ష్మ—రేలపూబొదమీద ♦ ప్రాలిన గిరిమల్లి
కాగుళుచ్ఛంబె ♦ ముఖంబు కాదు

రాము—గీ. తమ్ముడా మోసపోతి జ ♦ త్తమ్ముచెదర
నెందుజూచిన జానకి ♦ చందమెదుట
గలనుదోచును కాని ని ♦ క్కంబు కాదు
వెఱ్ఱియెత్తెడు నేమందు ♦ విధివశమున.

లక్ష్మ—అన్నయ్యా! మనస్సు స్వస్థత జేసికొనుము. పిపాసచే నొక వేళ గోదావరీనదీ జలంబులకై పోయియున్నదేమో! కను గొందమురమ్ము.

రాము—వెఱ్ఱితమ్ముడా! భూమిమీద పడుగుల జాడలేక గోదావరికి మాత్ర మెట్లుపోయినదని తలంచెదవు. అయిన నీ గోదావరిని గూడ ప్రార్థించిచూతము తల్లీ! గోదావరీ స్రవంతినీ (చేతులు మొగిచి)

గీ. నాసికాత్ర్యంబకమున జ ♦ న్మంబుగాంచి
వసుధజీవులకెల్ల జీ ♦ వన మొసంగి
పూర్వజలరాశిచేరు నో ♦ పుణ్యరాశి
భూమిసుతచెల్పు గోదావ ♦ రీమతల్లి.

అక్కటా ! ఇదియును కలుగవలయ్యె నింకెందు బోవుదమురా !

లక్ష్మ—అన్నయ్యా ! యిట్లొకసారి రమ్ము.

రాము—(నడచిచూచి) అమ్మయ్య ! దొరికినదిరా సీత ! అల్లదే చూడుము.

చ. కిసలయపాణి సీతయదె ! కేసరి వృక్షముపొంతనిల్చి చే
విసరుచు నన్ను రమ్మనుచు ♦ వేచుచుబల్కగజొచ్చె జూడుమా

లక్ష్మ—కుసుమలతామతల్లి యదె ! ♦ కొంచెపుగాలికి నల్లలాడ భ్రా
మిసుతయటంచు నీమది భ్ర ♦ మించితి వంతియెకాని సీతయే.

రాము—అన్నన్నా ! యెంతమోసము జెందితినిరా తమ్ముడా! ఓపృథి
వ్యాది పంచభూతములారా! ఓప్రభాకరనిశాకరాదినవగ్రహ
ములారా! ఓసకల జీవకోటులారా ! ఓ నిర్ఝరీగిరి వనంబులారా

చ. పరమపవిత్రురాలు రవి ♦ వంశ సుధాకరురాణి నామనో
హారి జనకాత్మజాత విమ ♦ లాత్మధరిత్రి నయోనిజాత భీ
కరవననీమ నొల్పడితి ♦ గాంచిన నాకెఱిగింపరే ? మహా
త్తరసుకృతంబు కల్గు దయ ♦ దాల్పరె ! మీకు నమస్కరించెదన్

(నమస్కరించి అటునిటుజూచి) ఔరా ! ఎంతవిపరీతము ! నాచేత సంబోధింపబడిన వారొక్కరును ప్రతివచనంబీయకున్నవారే ? సరే కానిమ్ము. తమ్ముడా ! (ధనువు నెక్కువెట్టి) నామాటకు ప్రత్యుత్తరం బీయని భూతగ్రహావిశిష్టమైన యీ భూమండలమునునాబాణా గ్నిచే భస్మీభూతము గావించెదను జూడుమా.

లక్ష్మ—అన్నయ్యా ! తాళుము. తాళుము.

రాము—(తమ్ముని ద్రోసివైచి) ఛీ, యటుల దొలగుము. (ఆకసము వంకజూచి) హా పాపప్రపంచకమ !

శా. నాకళ్యాణియె నామనోహరియె నా ♦ నారీశిరోరత్నమే
లోకంబందున దోపకున్నయప్పు డీ ♦ లోకాళితో నాకక్షే

లా! కల్లోలముకాగ సర్వమును సం ♦ హారంబుగావింతు నా
రాకాచంద్రప్రభాకరాది గ్రహతా ♦ రామండలిన్ దుల్చెదన్,
(ఆగ్రహముతో దిక్కులజూచును)

లక్ష్మ—అన్నయ్యా! ఎందుల కీక్రోధము? ఎవ్వడో అపరాధము
సేయ జగంబులపై నాగ్రహించెదవా!

రాము—తమ్ముడా! నాకోపమెందుల కెరిగెదవా?

చ. హరిహరబ్రహ్మముఖ్య ♦ దివిజావళి నామక ఘోరశస్త్రదు
ర్భరవిలయాగ్ని కీలలకు ♦ భావమునందున తల్లడిల్లి నా
తరుణిని దెచ్చియిచ్చి ♦ ప్రయతంబున నన్ను భజింత్రు తక్కవన్
ధరణిని సర్వదేవతల ♦ దగ్ధముగా నొనరింతుతమ్ముడా!

లక్ష్మ—అన్నయ్యా! సర్వజగతుల రక్షింపజాలిన నీవే యిటులాగ్ర
హింప లోకముల కాపవలుమాడదా! ఎవ్వడో ఒక్క
తులువ మనకపకారము సేయ జగంబుల సంహరింపదగునా!
నీవు లోకారాధ్యుడవు, లోకశరణ్యుండవు, లోకకర్తవు,
స్వామీ! శాంతింపుము.

రాము—హుం అన్నన్నా! నాయాగ్రహమున న్నేదహించుచున్నది
కదా! మంచిది తమ్ముడా! యిపుడు కర్తవ్యమేమి?

లక్ష్మ—స్వామీ! ఆప్రకేవసేవో చచ్చిపడిన ఖరవాహనములు కని
పించుచున్నవి. వాటికిగారణమరయుడమురమ్ము(నడచిచూచి)
అన్నయ్యా యిక్కడ నొక్కరథము ఆకసమునుండి విరిగి పడి
నట్లును కొన్ని పుష్పమాలికలును గానవచ్చుచున్నవి. అల్లవే
చంపబడిన ఖరవాహనము లాయెడగూలినవి, కారణమేమో
తెలియరాదు.

రాము—ఇందుచే గగనసంచారితో నెవ్వరితోడనో పోరు గలిగినట్లు
స్పష్టపడినది.

లక్ష్మ—అదిగో! ఆ ముందేదో కూలిసల్లున్నది.

రాము—ఔనౌను. ఆ పర్వతాకారుడైన పక్షిరాజు మన జానకిని మ్రింగియున్న వాడేమో కదా. (తెర తీయగా జటాయువు కనుపడును)

లక్ష్మ—అన్నయ్యా! యీ విహంగనాథుని వృత్తాంత మరయక త్వరపడకుము.

రాము—శత్రువును నేమనుకొనిగినా చంపుట కావున వీని వధింపక మానను. (బాణము సంధించును)

జటాయు—మహాత్మా రామచంద్ర! చంపకుము చంపకుము. నేను నీ పితృసఖుండను. జటాయువను పక్షినాథుడను. మీరు లేని సమయమున సీతాదేవి జానకిని రావణుండు కొంపోవుచుండ నేను వాని నడ్డుకొని ఛత్రమును, వాహనములను, కవచమును, చాపంబును, రథంబును త్రుంప విరథుండై సీత నక్కడడించి దప్పిచే నాయాసపడుచున్న నా రెక్కల ద్రుంచి కూల్చి సీతాదేవి నెత్తికొనిపోయెను. నేనీవార్త నీ కెఱింగింప జీవము లుగ్గబట్టుకొని యున్నవాడ, నన్ను నీ తండ్రియట్లు భావించి యగ్నిసంస్కారము చేయవేడెదను. నేనిదే ప్రాణముల విడుచు చున్నాను.

రాము—హా పితృసఖా! హా పరోపకారపారీణ! పక్షికుల పతంగమా!

చ హితునికుమారుభార్య నొక ♦ డెత్తుకుబోవుచునుండ గ్రోధఘూర్ణితహృదయుండవై వివిధ ♦ రీతుల శాత్రవుదూల్చి కూలితే పతగకులాధినాథ! గుణవంతులు ♦ యోగ్యులు బ్రోచుపట్ల జీవితము తృణంబుగా దలచి ♦ వీడుట నైజము కాదె; పూజ్యుడా!

తమ్ముడా! మనతండ్రి కగ్నిసంస్కారము సేయుటకు మనము నోచకున్నను పితృతుల్యుడైన యీ ఖగనాథున కగ్నిసంస్కా

రాదుల జేయవలయును. మరియు నోరోరి కారణ ! నీవు నాయాగ్ర
హాగ్నికింధనప్రాయుడవై తివిరా ! పరిక్తకంధర !

ఉ. శిష్టజనంబులన్ గరుణ ♦ చేబరిపాలనసేయ గర్తయున్
దుష్టుల సంహరింప లయ ♦ ధూర్జటియైన ననున్ సతీమణీ
నష్టునిగాగ జేయదగు ♦ నా నిను భాతృసతీసుతాదిక
భ్రష్టుని జేసి క్రోధశిఖ ♦ బ్రాణములన్ హరియింపకుందునే !

లక్ష్మ—ఓరోరి నిశాచరాధమా;

ఉ. రావణ నీదు పాపపు శి ♦ రంబులద్రుంపగ రాముపాలు శో
కావిలులైన నీయనుచ ♦ రాళివధింపగ నాదుపాలురా
పావనిసీత నొంటి బల ♦ వంతముగా హరియించినంతనే
జీవముతో సుఖింతువె ♦ నశింపవె భ్రాతృసుతాది సేనతో.

(ఇద్దరు నిష్క్రమింతురు)

---

## 7 వ రంగము : వనాంతరము

[ కబంధకళేబర విశిష్టము రామలక్ష్మణులు ప్రవేశించెదరు ]

రాము—తమ్ముడా ! మన మతిక్రమించిన యరణ్యమునకంటె నీవన
మతిభయంకరమై యున్నది. జానకిని గొంపోయిన రావణు
డిందుండ లేడుకదా ?

లక్ష్మ—ఈగహనసీమ రాక్షసులకు నివాసభూమి కావచ్చును.

అయోముఖ—(రాక్షసిప్రవేశించి) ఓహోహో! నేను పుట్టినపిమ్మట
నింత చక్కనివారిని జూడలేదు. వీరిని జూడగనే చంపి తిన
వలెనన్న బుద్ధిపోయి సరసులగా జేసికొని కామసౌఖ్యమనుభ
వింప నాకాంక్ష కలుగుచున్నది. (ప్రకాశము) ఓ మానవులార!
మహావ్వా యెంతచక్కగ నుంటిరిరా. (లక్ష్మణుని కౌగలించు
కొనును)

రామ—తమ్ముడా! శూర్పణఖకు చేసిన యలంకారముచే దీనికి నొసంగి సంతోషపరచుము.

లక్ష్మ—ఓసీ నిశాటినీ! నీకామాంధకార మదమెడను రాకమ్ము. కత్తితో జన్నులగోయుదు.

అయో—అరే అరే! చచ్చితినిరా విధవా! (పారిపోవును)

రాము—వత్సా! లక్ష్మణ! ఇదిమొదలు మనకు దానవవధ నిత్య కర్మ సుమీ!

లక్ష్మ—అన్నా! అట్లుకాదు. ప్రతిక్షణ కర్మయనుడు.

కబంధుడు—వహ్వా! నేను కదలలేకపోయినను చాలాకాలమునకు నాకు మనుష్యమాంసమును భగవంతుడు లభింపజేసినాడు కదా (చేతులతో రామలక్ష్మణుల నాకర్షించును) ఓరీయింకెందుబోగలరురా నానోట జిక్కినారు లెండి.

రాము—తమ్ముడా! యివేవో రాక్షసబాహువులు మనల నాకర్షించినవి. నీవాభుజమును నరుకుము. నేనీబాహువును ద్రుంచెదరు (అట్లు సేయుదురు)

కబంధు—ఓహో మానవులారా! యెంతకాలమైనను నాబాహువులు నరుకువారు నాకు గానబడలేదు. మీ రెవ్వరో మీవృత్తాంత మేదో చెప్పుడు, మీకు బుణ్యముండును.

లక్ష్మ—ఓరీ! యీ మహాత్ముడు రామచంద్రుడు, నేనులక్ష్మణుడను మేము యిక్ష్వాకుకులజులైన దశరథుని పుత్రులము. మావదిన గారైన సీతాదేవిని పంచవటీతీరమున గోల్పోయి వెతకుచు నిటు వచ్చినాము.

కబంధు—ఆహా మహాత్ములారా, మాంపాహి మాంపాహి నాకిం ద్రునిమాట స్ఫురణకు వచ్చినది, నేనుస్థూలశిరుండనుమునిని బరిహాసించి మూడు యోజనములపొడవుగల బాహువులుగల

యిట్టి స్థూలశరీరమును శాపవశమున గాంచినాను. అప్పుడీశాప విమోచనక్రమము నెఱింగింపు డన రామలక్ష్మణులు వచ్చి నీబాహులెప్పుడు నఱకుదురో అప్పుడే నీకు శాపవిమోచనమని యానతిచ్చెనటులే నా శాపవిమోచనమైనది. బ్రహ్మదత్తవర ప్రభావంబున గర్వించి కామరూపినై సంచరించు ధనువనెడు గంధర్వుండను. ఇంకి వేవంజనములు.

రాము—ఓయీ నీవు సీతావృత్తాంతము నేమైన నెఱుంగుదువా!

కబంధు—స్వామీ! నాశరీరమును దహించితిరేని దివ్యశరీరమును దాల్చి సర్వము నెఱింగించెదను.

రాము—తమ్ముడా! అగ్నిసంస్కారపు ముచ్చట మునకింకను తీరలేదు. వీనిని దహించుము?

లక్ష్మ—చిత్తము. (వానినీడ్చికొనిపోయి దహించును)

(తెరలో) రామలక్ష్మణులార! రావణుండు జానకీదేవిని దస్కరించి యాకాశమార్గమున బోయెను. వానిని సంహరించుటకు వాలిచే బహిష్కరింపబడిన సుగ్రీవ హనుమదాదులు ఋష్యమూకంబున నున్నవారు. వారితో సఖ్యము జేసికొంటిరేని యారావణునోర్చి నీభార్యను నీకు జేర్పగలరు. ఈమార్గమున బోయిన పంపాసరోవరమును శబర్యాశ్రమమును కనుపట్టు. ఆశబరివలన తన్మార్గమెఱింగి ఋష్యమూకంబున బ్రవేశించుడు. మీకు శుభంబగుగాక సెలవు పోయెదను.

రాము—తమ్ముడా! ఋష్యమూకమునకు ద్రోవతీయుము.

(నిష్క్రమించెదరు)



# సంపూర్ణ రామాయణము

# అష్టమాంకము



## 1 వ రంగము—ఋష్యమూకము

[సుగ్రీవ హనుమదాది వానరులు ప్రవేశించెదరు]

సుగ్రీ—హనుమంతా! ఆప్తసైన్యనాయకా!

ఉ. ఘోరశరాసనంబులను ♦ గోలలు దూణములున్ వాల్చి మానితా
కారములన్ ధరించి వడి ♦ గా మన తావును జేరవచ్చుచు
న్నారదె పుర్షులిద్దరు మ ♦ నంబునఁ గలంకెడు వాలి పంపఁ బై
తీరున వచ్చునంచును మ ♦ దిన్ దలపోసెద యోచసేయుమా.

హనుమం—స్వామీ సూర్యనందనా! వాలిభయముచే నీవట్లు తలంచుచున్నావు; కాని నేను కేమియుపచారము జేసితిమని వారింపఁగల కారణమున్నది! యింతకును ధర్మాధర్మములు లరయకుందురా! ఒకవేళ దండింపఁ దలంచి వచ్చినను వారికి ధర్మముదెల్పి బుద్ధి మరలింపకుందుమా!

సుగ్రీ—అటులైన నీవు కొండదిగి వారికెదురేగి వారి రాకకుఁ గారణ మరయుము. అంతవరకు నేనీగుహలో నుండెదను.

హను—చిత్తము. (దిగి యెదురువచ్చును)

రామ—తమ్ముడా! శబరిచెప్పిన ఋష్యమూక మిదియే కావచ్చును ఆహా! యిది యెంతనివాసయోగ్యమైనది? అందుచేతనే యిందు మతంగముని యాశ్రమము నిర్మించుకొని తపమొనరించెను.

హను—(సమీపించి) మహాత్ములారా! మీ కివె పదివేల వందనములు,
మీరెవ్వరో వచించి నన్ను కృతార్థుని జేయుడు.

లక్ష్మ—కపిశ్రేష్ఠా!

ఉ॥ ఈతడు రామచంద్రుడు ద ♦ శరథులాగ్రజ చంద్రుడేను త
ద్భ్రాతను లక్ష్మణుండ పి ♦ తృవాక్యము దీర్పగ దండకాటవిన్
బ్రాతిగ జేరి యుండ నొక ♦ రాక్షసుచే రఘురాముభార్యయౌ
సీతను గోలుపోయి కపి ♦ శేఖర! వచ్చితిమీవిధంబునన్.

కాని నీ వెవ్వండవు?

హను—మహాత్ములారా! అంజనీగర్భంబున వాయుదేవునకు పుట్టిన హనుమంతుడను వానరుడ. కపిసార్వభౌముండైన సుగ్రీవుని మంత్రిని. ఆ సుగ్రీవుండు ఋష్యమూకంబున నున్నవాడు. మీరాతనితో సఖ్యము జేసికొంటిరేని మీ కార్యము సఫలము కాగలదు.

రాము—మారుతీ! నాకంతకంటె గావలసినదేమున్నది. రమ్ము పోవుదము (కొండనెక్కుదురు)

హను—అయ్యా! కపిసార్వభౌమ! సుగ్రీవా! వచ్చి యీపుణ్యపురుషుల సందర్శించి కృతార్థుడవుకమ్ము.

సుగ్రీ—(ప్రవేశించి) పరమపురుషులారా! నాయభివందనముల నంగీకరించి నాయాతిథ్యము గైకొనుడు,

రాము—సుగ్రీవా! నీకు భద్రముకలుగుగాక!

సుగ్రీ—పూజ్యులారా! మీరీ పచ్చరాతిచరియపై గై సేయుడు
(అందరు కూర్చుందురు)

హను—సుగ్రీవ సార్వభౌమా! యీ మహాత్ములు రవివంశజులైన రామలక్ష్మణులు. తండ్రిగారియాజ్ఞచే వనవాసంబు సేయవచ్చి దండకారణ్యంబున సీతను రాక్షసులచే గోల్పోయి యీ మార్గమున వెదకుచు వచ్చినారట.

సుగ్రీ-రాము—గీ. అగ్నిసాక్షిగ మనకు ♦ సఖ్యంబుసుమ్ము
పరగ మనకోర్కె సత్వరప్రాప్తమగుట ♦ నెరపుపట్ల
ప్రాణములనైన ధారవో ♦ యంగవలయు
విడువరా దెన్నటికినైన ♦ బుడమిలోన

హను—తథాస్తు! రామచంద్రమూర్తి! మీకార్యమునకై మేమందరము మా ప్రాణముల ధారవోసెదము. సందియము లేదు. కాని ముందుగ మీరొక కార్యము చేయవలయును.

రాము—సర్వదా సిద్ధముగ నున్నవాడ. ఆనతిండు.

సుగ్రీ—స్వామీ! భార్యావియోగదుఃఖముచే మీరెట్లు తపించుచున్నారో నేనును అట్లే శోకించుచున్నాను. ఏమందురేని యిక్కడకు సమీపదూరమున కిష్కింధయను పట్టణము కలదు. దాని నింద్రపుత్రుడైన వాలి పాలించుచుండ నొక్కనాడు మాయావియను రక్కసుండు వచ్చి యాహవమునకు రమ్మని బిల్వ మేమందరము వాని నెదుర్కొంటిమి. వాడును సహింపలేక యొకకొండబిలంబున బురజొచ్చె. నంతమాయన్న వాలి మమ్మందర గుహాముఖంబుననుండ మని చెప్పి తాను గుహలో జొచ్చె. నది మొదలాదరీముఖంబుననుండి రక్తంబు పారజొచ్చె. ఇట్లాఱుమాసములు గడచిపోవ మాయన్న మరణించెనని తలంచి మరల వాడు కిష్కింధకు వచ్చునను భీతిచే పెద్ద పెనురాతితో నా గుహాముఖమున కడ్డువైచి వచ్చితిమి. పుర మరాజకమని యెంచి పెద్దలందరు కిష్కింధాసామ్రాజ్యమునకు నన్ను రాజుగా నభిషేకించిరి. కొంతకాలమునకు మా అన్న కిష్కింధకు వచ్చి కొండబిలమున కడ్డువైచితివని యాగ్రహించి నన్ను జావగొట్టి నా భార్యను హరించెను. స్వామీ! మీరెట్లులైన నా వాలిని సంహరించి నా భార్యను నాకు జేర్చుటకు ప్రార్థించెదను.

రాము—ఆహా సుగ్రీవా! ఎంతఆశ్చర్యము!

శా. ఆలిన్ గోల్పడి క్రూరకాపురుషుచే ♦ హా యీర్ష్యరాయించు దీ
నాలాపంబుల నీవు క్రోచెదవో నా ♦ హా నన్ను రక్షింతువో
వాలిన్ దూలితిరంచు వైరినయి సం ♦ చారమ్మొనర్చుచు నే
నా! లావొప్పను వాలిరూపడచి నీ♦యాలిన్ గడున్ గూర్చుటల్.

లక్ష్మ—అన్నయ్యా! పత్నీవియోగముచే మతిచెడి న్వపరామము నెఱుంగక ఆశ్రితరక్షణ బిరుదాంకితమును మఱచుచున్నావు యిపుడేగదా సుగ్రీవునితో నగ్నిసాక్షిగ సఖ్యంబు జేసితివి! నీవు వాలిని ద్రుంచుటెంత సుగ్రీవుని భార్యను వీనికి జేర్చుటెంతపని?

రాము—అవునోయి తమ్ముడా! యీతడవశ్యము రక్షణీయుడు. కపి శ్రేష్ఠా! సుగ్రీవా! భయపడకుము.

మ. ఘనగర్జారవ ముప్పతిల్లగ ధరల్ ♦ కంపింపంగా జేసి భీ
షణకాలోగ్రనిశాత బాణముల వి ♦ శ్వంబెల్లభీతిల్ల వా
లినిసంహారము జేసి నీదు ప్రియురా ♦ లిన్ గూర్తునిక్కంబు నీ
వనుమానింపకుమన్న కీశకులనా ♦ థా! నమ్ము మిమ్మాటకిన్.

(చేతిలో జేయివైచును)

సుగ్రీ—స్వామీ! మహాప్రసాదము నాకింకనొక్క సందేహ మున్నది యేమందురా?

చ. ఉదయ నగంబునుండి పడి ♦ నొక్కటన స్తనగంబు మీదికిన్
బదపడి దాటి కొండలను ♦ బట్టుచు బంతులపోల్కి నాడు దో
ర్మదమున వాలి వానిని మ ♦ రంబున గూల్చువెయుంచు శంకనా
మొదవెనించెనయ్య పృథివీశ్వర! దుస్సహము లెట్టి వారికిన్.

రాము—సుగ్రీవా! అందులకై నీవు శంకింపవలదు.

సుగ్రీ—మహాత్మా! మిమ్ములనే పరీక్షించుచున్నానని తలంపవలదు.

సుగ్రీ—మహాప్రసాదము. తరువాత వెంటనే హనుమదాదులఁ బంపి సీతాదేవిని వెదకించెదను.

(అందరు నిష్క్రమించెదరు)

---

## 2 వ రంగము—కిష్కింధాపురోపకంఠసీమ

[యుద్ధసన్నద్ధులైన వాలిసుగ్రీవులును చెట్టుచాటున రామలక్ష్మణులు ప్రవేశించెదరు]

వాలి—ఓరీ సుగ్రీవా! నేడు నీకింత మదంబు హెచ్చుటకు హేతు వెయ్యదిరా?

ఉ. ఎవ్వరిసాయమున్ గలిగి ♦ నీమొనఁ బువ్వుబుసాహులాజిలో
దివ్వడొలంగి పాఱియును ♦ ఛీ! మగలఁ బలమెత్తి సిగ్గు లే
కెవ్విధి బోరుసల్ప గమ ♦ కించితి వోరవిపుత్ర! రమ్ము ని
గ్రొవ్వణఁచి వైతు నిది ♦ గోఘనముష్టిహతిన్ క్షణంబులో.

సుగ్రీ—ఓరీమూర్ఖ! పరదారాపహరణపరాయణా! వాలీ!

చ. అనుచితమైన పాపమని ♦ శాస్త్రదలంపక దుష్టబుద్ధి నా
వనితను దస్కరించి నను ♦ బారగఁ దోలిన నీయఘంబె నా
శనిమొని సాయమౌచు ప్రబల ♦ యాగ్నివిధంబున నిన్ దహించురా
చెనటి! కృతాఘసంతతులు ♦ చేటును కూర్పక సౌఖ్యమిచ్చునే.

వాలి—ఓరీ రవినందన! నీయాలిని గొన్న నాపాపము నీకు సాయపడదు కాని నీవతెభార్యను గోల్పోబడినవాడె నీకు సాయపడుటకు వచ్చియుండునని తలంచెదను. మంచిది యిప్పుడే నీబలమును నీసహాయపరుని బలంబును దృటిలో హరించెదను గాక రమ్ము యుద్ధమునకు (ఇద్దరు యుద్ధమును సేయుదురు సుగ్రీవుడు వెనుకకు పోవును)

వాలి—సుగ్రీవా! ఏమి అప్పుడే పారిపోవుచుంటివా!

లక్ష్మ—సాధ్వీ! మేము రఘువంశసంభూతులము; ఇతడు రాముఁడు, నేను లక్ష్మణుఁడను.

అంగ—అయ్యలారా! మీ రిందేల వచ్చితిరి?

లక్ష్మ—మాయన్నగారి భార్యను రాక్షసులు గొంపోవ వెదకుచు నీలాగున వచ్చితిమి.

వాలి—హా ప్రియురాలా! ఆ రాముఁడే చెట్టుచాటుననుండి ఘోరశిలీముఖంబున నన్ను గూల్చినాఁడు. లేకున్న సుగ్రీవునకీపాటిబలమా?

తార—హా జీవితేశ్వరా!

చ. అనుజుఁడు సంగరంబునకు ♦ నై నినుబిల్వఁగ వాని కెవ్వఁడో
ఘనతర విక్రముండు సహ ♦ కారిగ వచ్చెనటంచు విందు నో
యనఘుడ! పోవలదని న ♦ యంబున జెప్పిన ద్రోసివైచి రా
ముని శరవహ్ని పాలబడి ♦ భూమిని ద్రెళ్ళితె ప్రాణనాయకా!

వాలి—హా బాధ సహింపజాలను కదా!

అంగదు—హా తండ్రీ! అక్కటా యెంత బాధ పడుచుంటివో కదా!

ఉ. జనకా! నీప్రియపుత్రునిన్ బిలచి వ ♦ త్సరమ్ము నాయంక సీ
మను గూర్చుండుము ముద్దులిమ్మనుచు బల్మారెంతొ ప్రేమించి పె
ల్చిన మూర్ధంబును దావి నానితమిచే ♦ లాలించు వారెవ్వరో
యనఘా క్రూరశరాగ్ని పాలయితి ♦ వయ్యా నాకుదిక్కే దికన్

తార—హా ప్రాణేశ్వరా! నీప్రియురాలిని నీయంగదకుమారుని నొక్కసారి కనువిచ్చిచూచి మంచిచెడ్డలు చెప్పవా?

వాలి—(చూచి) ప్రియురాలా! తారా! వత్సా అంగదకుమారా! ఊరడిల్లుడు, నాకాలగతి యిట్లున్నది. రామా! నీవు సకల లోకపూజ్యుండవని మునులు చెప్పగ వినియున్నాను. కాని కేవల మధర్మముగ జెట్టుచాటుననుండి అన్యునితో రణము చేయునప్పుడు నన్ను గూల్చి నీకీర్తినిదగులబెట్టికొన్నావు కదా!

నైతిని. నీచే జావు నాకు సనవర్గ సుఖమీయగల్గును. నాకీ యవస్థ గలిగినందుకు విచారించుట లేదు. కిష్కింధా రాజ్యము సుగ్రీవునిచే నేలించినను నా యంగదకుమారునకు యౌవ రాజ్యపట్టాభిషేకము జేసి నీ పుత్రునట్లు రక్షించుము. నే నీ ఘోరశిలీముఖ బాధభరింపజాల. వేగదీనిని పెఱికి నాకు సద్గతులీయుము. నీకివే వందనములు.

రాము—వాలీ! నీ కుమారుని నీవు చెప్పినటులే కరుణించెదను.

తార—హా ప్రాణేశ్వరా!

చ. సతులకు బ్రాణనాయకుడె ♦ సర్వసుఖంబులు జీవితంబు దు
ర్గతిబడి నీవుపోవగ జ ♦ గంబులతో బనియేల నాకు నా
పతితపతుకీలలంబడిరొ ♦ యుగ్రమహోదధి గూలి యోాయసు
ప్రతతిని బాసి నీకుపద ♦ పద్మములన్ భజియింప వచ్చెదన్.

వాలి—దేవీ! నీ పట్లుకుము. నాకు సద్గతియె లభింపనున్నదని తలం చుము. అంగదకుమారా! నీవు శోకింపక యీ రామ చంద్రు నారాధించు చుండుము.

అంగ—హా జనకా! నిన్ను విడచి యెట్లు సహింతునయ్యా!

చ. ధరణితలంబు క్రుంగిన వి ♦ ధంబున నింగియు బ్రద్దలౌచు నా
శిరమున గూలినట్లు లయ ♦ సింధువులొక్కట ముంచురీతి దు
ర్భరతర దుఃఖము న్నొదవె! ♦ రాముని ఘోరశిలీముఖంబుచే
దొఱగిన నిన్ను జూడగనె ♦ దుఃఖముబొందక యెట్లునై చెదన్.

వాలి—క్రూరా! యిక విచారింపకుము. దేవీ! మీకిక రాముడే శర ణ్యుడు రామా! నేనికసహింపజాల. వేగశరము నున్మూ లింపుము.

రాము—అటులే చేసెద. నీకు బుణ్యలోకములు వచ్చుగాక! (బాణ మును దీయును)

వాలి—హా రామ హా రామ! (ప్రాణములవిడచును)

తార—హా ప్రాణేశ్వరా! హా లోకైక విక్రమా!

మ. నను నీయుంగవపుత్రుని న్విడచి మా ♦ న్యంబైన స్వర్గమ్ము నం
దనయంబున్ సుఖమొందబోయితివె! నా ♦ థా యింక నా కేలయీ
తనువు న్నీ చితిలోన ద్రెళ్ళి యిప ♦ త్తాపంబులన్ గొల్వగా
జను దెంతున్ బతికేమి నా బ్రతుకు నై ♦ శ్వానంబునన్ భారమా.

హా జీవితేశ్వరా! పితృమృతియే కల్గకని యెంతయుతపించితివో అంతనిష్ఫల మయ్యెగదా!

అంగ—హా సుతవత్సలా!

గీ. తండ్రి! నీవస్తమించుట ♦ ధాత్రి యెల్ల
నంధకారమ్ము క్రమ్మె నా ♦ యాత్మ శూన్య
మయ్యె రెక్కలు తెగిన వి ♦ హంగమట్లు
తీవ్రశోకాగ్ని పాల్పడి ♦ తెగి కదయ్యె.

రాము—వత్సా! అంగదకుమార! శోకడిల్లుము మరణమేరికిని తప్పదు.

అంగ—అహా రామచంద్రా! ఎంతవాడవయ్యా!

గీ. జనకుని వధించి యొచ్చెదు ♦ తనయు జూచి
యూరడిలుమంచు బల్కె దీ ♦ కుచిత మగునె
సర్వలోక శరణ్యుల ♦ గుణములిట్టు
లలరునే రామచంద్ర మ ♦ హాను భావ!

రామ—అంగదా! జీవులు స్వకర్మచేతనే కష్టసుఖముల ఫలము ననుభవించెదరు. తత్కర్మలే జననమరణములకు గారణములు గాని యొకరి నొకరు చంపువారు లేరు. రక్షించువారు లేరు. కర్మకారకులు నిమిత్తమాత్రులు కావున నీవు చింతింపకుము. నీజనకునకు బుణ్యలోకముల నొసంగినాను.

తార—రామమూర్తీ! పుణ్యలోకమో పాపలోకమో భవిష్యత్తు నెవ్వరు నిర్ణయింపగలరు నీవు పరమేశ్వరుడవని గర్వపడు

చున్నావేమో నీవును శరీరధారివే, మావలె నీవును సుఖ దుఃఖముల ననుభవించువాడవే, నీవుభగవంతుడవని మునులు బాగడ గర్వించి నాకేమియని నానాథు నధర్మమున జంపి నావు, యీ కలుషము నిన్ను దహింపక పోదు. నీవు భగవం తుడవైనను నానాథుడు నాకు భగవంతుడు అట్టివాడే యీ లోకమును బాసిపోయిన నాకీలోకముతో బనియేల? వేరు భగవంతునితో బనియేల? నాపతిని జంపుట నీకు దోషము లేదంటివి. ఆమహాపాపము నిన్నేల జుట్టుకొనదో చూచెదను, గాక, నాశాపఫలమిదే యనుభవించుము, నేనే నిజమైన వీరపతివ్రత నైతినేని.

ఉ. ఆలినిగోలుపోయిన మ ♦ హావ్యధచే దపియించుచుండియున్
శీలములేక దొంగవలె ♦ జెట్టునకావలబొంచి నాపతిన్
గూలిచి యాలిసౌఖ్యమున ♦ కున్ వెలిజేసితివీవు కాన నీ
యాలినిజెంది నత్వరమ ♦ యాలిని బాపినవంత నొందుమా!

రాము—తారాసాధ్వీ! నీశాపమువలన నీపట్టునవాభార్యనునేనుబొం దగలనని సూచింపబడినది, తరువాత వియోగదశవచ్చుగాక రాకపోవుగాక. ప్రస్తుతమునాసతినిబొందిననాకదియేపదివేలు,

తార—హా మహానుభావ! రామచంద్ర! దుర్భరమైన వైధవ్య దశ ననుభవింపజాలక క్రోధావేశంబున నిన్ను శపించితిని, నాయపరాధమును మన్నింపుము.

రాము—అమ్మా! తారా! నా భవిష్యత్కర్మ ననుసరించియే నీనోటనుండి యీమాటవచ్చియుండును, అందులకై నాకు జింతలేదు. రమ్ము పోవుదము, నీభర్తకగ్ని సంస్కారము సేయవలయును, గదా!

తార—చిత్తము. (అందరు నిష్క్రమింతురు)

---



# సంపూర్ణ రామాయణము



## నవమాంకము



### 1 వ రంగము—మహేంద్రగిరి

[జాంబవదంగద హనుమంతులు ప్రవేశించెదరు]

జాంబ—హనుమంతా! బుద్ధిమంతా!

గీ. ఆవిధంబుగ సంపాతి ♦ యను ఖగపతి
శంక లేకుండ యాసీత ♦ లంకలోన
నున్నదంచును జెప్ప నీ ♦ వూరకుంట
తగునె వేవేగ నీవార్ధి ♦ దాటవలయు.

మఱియు నీమహోదధి నుత్తరింప నీవుకాక మాలో సమర్థులు లేరు. ఇందుల కీవే యర్హుడవు నిన్ని కార్యసాఫల్యము జేయుటకు బట్టభద్రుని జేసితి నీకు జయమగుగాక! (పుష్పహారమును వేయును)

హను—జాంబవంతా! నీవు పూజ్యుడవు. నీ మాటప్రకార మట్లే చేసెదను.

సీ. కుప్పించి యెగసిన ♦ గులగిరుల్ క్రుంగి పా
తాళకచ్ఛప ♦ తలితల్లడిల్ల
వాల విక్షేపనం ♦ భవమారుతంబున
నంబరచరులెల్ల ♦ రడలిపార
గమనవేగంబునను మహీరుహ ♦ హములెల్ల
విరిగిమిన్నంటినా ♦ వెంటనడువ

నావైనకర్ణకుం ♦ డల రత్నములపోల్కి
నిన శశిబింబంబులో ను ♦ నిసియాడ

గీ. నాకసమ్మున కెగసి మహా ♦ ద్భుతముగ
నమృతముందెచ్చు ఖగపతి ♦ యట్లు నేను
జలనిధినిదాటి లంకవి ♦ శ్శంకజొచ్చి
జానకిని గాంచి వచ్చెద ♦ క్షణములోన,

జాంబ—తథాస్తు! నీకు నీజనకుడైన వాయుభట్టారకుండు సహాయ పడుగాక,

హను—మంచిది. నేనీశిఖర మెక్కి యందుండి లంఘించెదను.

(నిష్క్రమించెదరు)

---

2 వ రంగము—లంకాముఖద్వారము.

[లంకయను నిశాటిని, హనుమంతుడు ప్రవేశించెదరు]

లంక—ఔరా! ఈకోతిగా డెవ్వడో నిశ్శంకముగా వారాశిదాటి వచ్చెనే! ఓరీ! వానరాధమ! ఓరీ నీచమృగమ! యీ దేవతా భయంకరమైన రావణ సార్వభౌముని లంకాపుర మును రక్షించు లంకయను నేను నిశాటిని, నే నిందుండ నీ వెందుబోయెదవు? యెవ్వడవురా నీవు?

హనుమం—ఓసీ నిశాటీ! నేనీపురమునుజూచి పోవచ్చితిని (పోబో వును)

లంక—ఔరా కోతిగా! ఆగు మాగు మెందుబోయెదవు. (పోటు పొడుచును)

హను—ఓసీ రాక్షసీ! చచ్చితివే (గుద్దును. లంకకూలును)

లంక—ఓహో వానరనాయకా నీవెవండవో తెలిసికొంటిని నీవురామ చంద్రునిభార్యయైన సీతాదేవిని వెతుకవచ్చినహనుమంతుడవు

రావా! తొల్లి బ్రహ్మ జానకికొఱకై వచ్చిన హనుమంతుడు
నిన్నెప్పుడు కొట్టునో అప్పుడు నాకు శాపవిమోచనమనియు
నీలంకయును సబాంధవుడగు రావణుడును హరింపబడునని
యానతిచ్చెను. అట్లు చెప్పినట్లే జరిగినది. నీకార్యము
సఫలమగును. కనుక పోవుడు నాకు సెలవిమ్ము. నాశాపమును
బాపిన నీకిదే వందనశతంబులు. (నిష్క్రమించును)

హను—మంచిది. నీవు పొమ్ము. ఆహా! యీలంక నాచే జచ్చి శాపవి
ముక్తినిగాంచి లంకాపురదాహఫలము జెప్పుటచే నాకు మంచి
శకునమైనదని తలంచెద. జనక దేవిని వెతుకబోయెదను.
(నిష్క్రమించును)

---

8 రంగము : అశోకవనము

[సీత, త్రిజట, ధూమ్రాక్షి ప్రవేశించెదరు]

సీత—హా రామచంద్రా!

సీ. నను పర్ణశాలలో గనలేక ♦ హృదయంబు
బ్రీలబ్రాణంబుల ♦ విడచినావొ
అడవుల గుహలందు ♦ వరసి సన్గానక
యడవిగంగనుగూలి ♦ మడిసినావొ
సీత లేనట్టి నా ♦ జీవమేలని కొండ
కొననుండి యిలజావ ♦ గూలినావొ
అక్కటా! జానకీ ♦ యనుచు వాపోయి కృ
పాణంబుచే నసుల్ ♦ బాసినావొ
గీ. లేకయుండిన నన్ను నీ ♦ లీల నిన్ని
నాళ్ళు విడనాడియుంటివే ♦ నాథ! నీవు

సర్వలోకశరణ్య ! నీ సతికె యిట్టి
యిక్కటులు మూడ నిలెదులు లెక్కయేడ ?
హా రఘుకుల దీపక రామచంద్రా !

హనుమంతుడు—[ప్రవేశించి తనలో] అన్నన్నా ! యీలంకాపుర మున నెందు వెదకినను మాతల్లి జానకీదేవిజాడ సుంతయుగన రాలేదు. ఇక నా కార్యమెట్లు సాగునో తెలియదు: అయిన నీయశోకవనమునుగూడ వెదకెదను. (నడచి చూచి ఆశ్చర్య ముతో) ఓహో యీవృక్షమూలమున నవతరించినశోకదేవత వలెరాక్షసస్త్రీ పరివృతయై కూరుచున్నస్త్రీ సీతాదేవి కాదు కద ! ఆ అపును అన్నన్నా ! యెట్టి దురవస్థ ఘటిల్లినది !

గీ. ధూళిబొరసిన లేతీవ లీల, ధూమ
చయముగప్పిన శిఖకీల సరణి నకట
యీనిశాటులమధ్యమ హీనమారి
యెట్లు దుఃఖార్తయై కృశి యించెనోకో !
నిక్కముగ నీమె వైదేహి యనుటకు సందియము లేదు.

ఉ. చెక్కిలి పాణిపద్మమున జేరిచి యూర్పులవేడి మోవియున్
బొక్కగ నశ్రుబిందువులు సోగకనుంగవరాల్పఁ బెన్నెరుల్
చిక్కువడంగ బెన్జడల చే నలలారెడు నీమె సీతయే
నిక్కము శోకదేవత జనించిన యట్టులదోచె నక్కటా !

(తెరలో) ఓసీ ధూమ్రాక్షీ ! సీతసన్నిధికి మన రావణ సార్వ భౌముడు వచ్చుచున్నాడని తెలుపుము.

హను—ఓహో ! దేవితో ప్రసంగింపకుండ నేనువీనికన్నులబడరాదు: వీడుపోవువరకును సూక్ష్మాకారముతో నీయశోక పాదమెక్కి చెట్లయాకులలో నడగియుండెదను. (అట్లు చేయును)

చేటులు—(మేల్కాంతురు)

రావణుడు—[ప్రవేశించుచు] ఓరీ ధూమ్రాక్షా! నాయర్ధాంగియగు టకు సీత సమ్మతించెనా లేదా!

ధూమ్రా—స్వామీ! మేమెంత చెప్పినను మామాటలు వినకున్నది.

రావ—సరే యుంచిరి. నేనే చెప్పెదను. ఏమే సీతా!

మ. సురసామ్రాజ్యపదంబు నాకిదనుచున్ ♦ శోభిల్లుచుండెంజుమీ
తరుణీ! నాకెనురాడిపోరుధనుడీ ♦ ధాత్రీస్థలిన్ లేడు నీ
వరు డా రాముడు నాడె చచ్చెనని నీ ♦ స్వాంతంబునందెంచుమా
వెఱువంబోకుము నన్ను జేకొనుముగా ♦ వేగాగలీవే సతీ!

సీత—ఛీ! దురాత్మా! ఏమిరా ప్రేలెదవు!

ఉ. ఓరి నిశాచరాధముడ! ♦ యోకినిర్భయము కొన్ని నాళ్ళ! నీ
సారము బీరమున్ బలము ♦ జమ్మన శ్రీరఘురామ విక్రమో
దార శిలీముఖాళ్ళలకు ♦ దక్షము జెందిన యప్డు ముక్తి కాం
తా రతిసౌఖ్యమందెదవు ♦ తప్పక మోహమునీను నీకటన్.

రావణ—ఓజానకీ! యింకను రాముడీ లంకకు వచ్చునని యే తలంచు చున్నావా! వెఱ్ఱిదానా! ప్రాణసమానురాలవైన నిన్నుగన జాలక కోసికోసి ఏసిగి వేళటె యీవరకే యాతడు మడిసి యుండును. ఒక వేళ మొండిమై బ్రతికె నేని

ఉ. ఈశత యోజనాయతము ♦ నీయురమాన గంభీరమైన వా
రాశినిదాటి యీపురికి ♦ రాముడు వచ్చుటకల్ల భర్తపై
నాశ దొలంగుమింక ముద ♦ మారగ నన్నుబరిగ్రహించి యీ
యాశరరాజ్య లక్ష్మివయి ♦ యందుమనంత సుఖంబులన్ చెలీ.

సీత—ఛీఛీ! పాపము శమించుగాక! ఓరీ నిశాటాధమ! ఆరామ చంద్రుండీ వారాశిని దాటిరాలేడని పలుకుచున్నావు శాబోల్ల నట్లు తలంపకుము.

చ. అసురవధార్థమై జనన ♦ మందెను ధారుణి రాముడంచు నల్
దెసలను మ్రోగుచుండ జల ♦ ధిన్ దరియించుటలెంతమిమ్ముల్
వెస దునుమాడులెంత రఘు ♦ వీరుని మాటయుంటుండ నీదు దు
ర్వ్యసనమెనిన్ను జంపు దులు ♦ వా! స్వకృతాఘము రిత్తవోవునే

రావ—సీతా! నీవు వట్టిబేలవు. ప్రళయాగ్నిని సామాన్యంబని తలం
చుచున్నావుసుమీ! నా పరాక్రమము నీవెఱుంగవు.

ఉ. రావణు విక్రమంబునకు ♦ రాముడె కాదు త్రిమూర్తు లొక్కటై
దేవగణంబుతోడ నరు ♦ దెంచినగాని మదీయలోక వి
ద్రావణఘోర బాణశిఖి♦దగ్ధము బెందక నిల్వరంచు నే
నీవిధి గంకణంబు ధరి ♦ యించితిసుమ్మి తలోదరీమణీ!

(చెట్టుమీద హనుమంతుడు) నీతలలు భూమిమీద రాల్చుటకు మా
రామచంద్రుడు కంకణము గట్టుకొనియున్నాడురా! మదాంధా!

రావ—ఎవ్వడవురా నీవు? (అటునిటుజూచి) ఓహో యిదంతయు
నామతిభ్రమణము లేకున్న నీవారాశిదాటి వచ్చువాడెవ్వడు
సరే! సీతా! యిప్పు డేమి చెప్పెదవు?

సీత—ఓరి తృణప్రాయుడ!

ఉ. కత్తుకగోసి రక్తమును ♦ గ్రోలిన గ్రోలగవచ్చుగాని మై
గత్తులగోయుగాక చెడు ♦ గా! నినుజేయట కల్ల నీదు సం
పత్తులు మాయు నీవదన ♦ పంక్తులు ధాత్రిని రాలు రక్కసుల్
చత్తురు నిశ్చయంబిదియె ♦ శాపమొసంగితి రావణాధమా!

రావ—(తనలో) ఈమెను బలాత్కారముగ గొంపోదునుగాని బల
వంతముగ స్త్రీని స్పృశించిన జచ్చిపోవుదునని తొల్లి నాకొక
శాపమీయబడినది. అందుచే క్రమముగ సఖులచే సమ్మతి
పరచించెదనుగాక ఓసీ ధూమ్రాక్షీ! ఈమెకు నయభయములు

బుద్ధి చెప్పి క్రమముగ నన్నేలుకొనునట్లు చేయుదు నేను పోయెదను (నిష్క్రమించును)

ధూమ్రా—ఏమి సీతా! నీకింకను బుద్ధి తిరుగలేదా! ఎక్కడి రాముడు? ఎక్కడి లక్ష్మణుడు? వానరులు వచ్చు టెక్కడ? వారాశి దాటు టెక్కడ? ఇదియంతయు కల్లమాట. మా రావణ ప్రభువును చేపట్టితివేని యీ పుష్పోద్యానము లేమి? యీ వజ్రాల భవనము లేమి? యీ పుష్పశయ్యలేమి? యీ పరిమళద్రవ్యము లేమి? యీ దివ్యభోజ్యము లేమి? ఆ కేళీసుఖ సామ్రాజ్యమేమి! ఆహా! నీ వొక్క నారి రుచిచూచిన మగల విడువగలవా! కాంతలకు గావలసినది కామసుఖమే గదా! నా మాటవిని రావణప్రభువును చేపట్టుము.

సీత—అమ్మా! నన్ను చంపినను సరియే గాని చేపట్టి యమంగళ కార్యమునకు సమ్మతించుదానను కాను.

ధూమ్రా—అటులైన నిన్నిపుడే మ్రింగివేసెదను. (అలలలా ఆ, మ్రింగ బోవును)

త్రిజట—ఓసీ ధూమ్రాక్షీ! తాళుము తాళుము. ఆమె యెవ్వతె యని తలంచుచున్నావు; రాక్షసకులమునకు మృత్యువనుమీ.

ధూమ్రా—పోనిమ్ము నాకేల నేవాలక పోయి నిద్రించెదను.

(నిష్క్రమించును)

సీత—అమ్మా! త్రిజటా! కష్టసముద్రమున మునిగియున్న నాకు నీవు రక్షకురాలవు. నీ యోగ్యత మెచ్చదగినది. నీకు భద్రంబులు కలుగుగాక.

త్రిజట—అమ్మా, నీవు విచారింపకుము నీయందు రాముడు తెల్లని యేనుగనుబూన్చిన పుష్పకము నెక్కి రక్తముద్రావుచు మున్నంటెలోకంబుల మ్రింగినట్లు కలగంటి నిక తప్పక రామచంద్రుడువచ్చి నిన్నుద్ధరించును నీకష్టముచిరకాలముల్లో నొలంగును. నీవు సంశయింపకుము.

సీత—తల్లీ! త్రిజటా! ఎంతటిపుణ్యాత్మురాలవమ్మా!

ఉ. అమ్మ విభీషణాత్మజవు ♦ భాంగిరొ కష్టమహాబ్ధిమున్గి దుః
ఖమ్మునుబొందుచున్న గని ♦ కారముతో గనుచున్న దానవో
యమ్మ మదీయభర్త గను ♦ లారగగాంచితె స్వప్నమందు శ్రీ
యమ్ము లభించునీకు సుగు ♦ ణాన్వితవాటను నమ్ముచూ మదిన్.

ఓ ఆత్మసమురాలా! ఆమహానుభావుని యాకారలక్షణము లేమైన జెప్పగలవా!

త్రిజ—అమ్మా! నీ నాథుండింద్రనీల మాణిక్యకాంతులీను మేనిలావణ్యమువాడు. కంజదళాయతాక్షుడు మరియు నెన్నో శుభలక్షణములుకలవాడు. తప్పక నీ నాథుడే సందియము లేదు. నిన్నుద్ధరించితీరును. నాకు మిక్కుటముగ నిద్రవచ్చుచున్నది. నీవును గొంచెము సేపు నిద్రించుము నేను పోయెదను.

(నిష్క్రమించును)

హను—(చెట్టుదిగివచ్చి) ఈరాక్షసాంగనలు గాఢనిద్రకు ప్రారంభించినారు. నేను సీతామహాదేవితో మాట్లాడుటకు మంచిసమయము తటస్థమైనది. (సమీపించి) తల్లీ! జానకీదేవీ! రామచంద్రునిదూత హనుమంతుండిదే నమస్కరించుచున్నాడు.

సీత—(భయముతో జూచి) ఓరీ మాయావానరరూపధారీ! రావణా!

చ. ఎఱుగుదు నిన్ను రావణుడ ♦ వీవని కైతవ వానరాకృతిన్
బఱగుచు రామచంద్రునకు ♦ బంటునటంచు వచించినంత నే
స్థిరమతి నిన్ను నమ్ముదునె ♦ ఛీ దనుజాధమ! పొమ్ము శాంబరీ
కరణ సమర్థ లీభువన ♦ కంటకులంచు నెఱుంగకుంటినే.

హను—రామరామా! తల్లీ వైదేహీ!

ఉ. నమ్ముముతల్లి! నేనురఘు ♦ నాథునిదూతను నిన్ను నాయుర
ణ్యమ్ములలోసి కానక మ ♦ హాత్తర దుఃఖముచేత ఋష్యమూ

కమ్మును జేరి మార్గమున ♦ కాంతునితో జగన్మైత్రి జేసి శీ
ఘ్రమ్ముగ నీకు జాడగని ♦ యమ్మునవార్ధిని దాటివచ్చితిన్.

సీత—ఓయీ! అంతమాత్రమ్మున చెప్ప నానాథుని దూతవని నమ్మ జాలను.

హను—తల్లీ! అటులైన వేరే చెప్పనేల!

మ. ఇదె శ్రీరాముని యంగుళీయకము త ♦ ల్లీ! దీనివీక్షింప నీ
మదిలో శంకదొలంగి నన్నికను న ♦ మ్మంజాలుదీవమ్మ! నీ
పదదాసుండను నీకు సూనుఁడను నీ ♦ బన్నంబులున్ దీరనీ
యెదదుఃఖంబును వీడు రాముఁడు ఖలున్ ♦ హింసించినిన్గాచెడున్.

(ఉంగరము సీతకిచ్చును)

సీత—(చేకొని కన్నులద్దికొని) హా! శ్రీరామనామాంగుళీయకమా!

చ. పతినెడబాసి రావణుని ♦ బారికిజిక్కి కృశించుచున్నదో
వెతలనుమున్గి ప్రాణముల ♦ వీడుననో యేమొయటంచు రామభూ
పతికర కంజసౌఖ్యమును ♦ బాసిననున్ గనవచ్చినావె! హా
హితుఁ ననుబ్రోచుచో స్వసుఖ ♦ మెంచవుగా భువినంగుళీయమా!

హనుమంతా! నిన్నిప్పుడు నా ప్రాణేశుని దూతనుగా నెఱింగితిని. నా నాథుండు నన్నుద్ధరింతునని నిశ్చయముగ జెప్పినాడా! నామరది లక్ష్మణుడు నా మాటకలంచెనా! ఎప్పుడువచ్చెదనన్నాడో నిజము చెప్పి పుణ్యమునుగట్టుకొనుమా!

హను—తల్లీ! నిన్ను బాసిన యామహాత్ముల పరితాప మేమని చెప్పుదును. ఆ రామభూపల్లభుండు;

ఉ. హాయని వేడియూర్పిడు బ్రి ♦ యాయను హా జనకాత్మజాత, సీ
తాయను దైత్యుపాలయితె హా ♦ యను కష్టమునొందుచుంటివ
మ్మోయనుప్రాణముల్విడక ♦ యుంటివె! హాయని యేడ్చి భూమిపై
కాయముగూల్చి మైమరచు ♦ గాదె ప్రతిక్షణమందు దల్లిరో!

సీత—హా ప్రాణేశ్వర! నావలన మీ కెంతటి కష్టములు వాటిల్లినవో కదా!

హను—అమ్మా! ఆలక్ష్మణస్వామి ఘోష చెప్పనలవి యే కాదు.

ఉ. ఎన్నగరాని దుఃఖమున ♦ నేడ్చుచు మూర్ఛిలి లేచి యమ్మ! యా
చెన్నటి రాక్షసాధముల ♦ చేబడి యెంతతపించుచుంటివో
బన్నములందలేక నిజ ♦ ప్రాణము బాసితివేమొ తల్లి యం
చెన్నొ విధాల నశ్రువుల ♦ జేపనిగా నొలికించు గన్నులన్.

సీత—హా భ్రాతృవత్సల! లక్ష్మణ! నేనెంత పాపాత్మురాలనోయి.

చ. అనుపమ సద్గుణాంచితు ♦ డవైన నినున్ బహుపోక్తులాడి యా
యనఘుని రామచంద్రుని ప ♦ దాబ్జములన్ నినుబాసి యక్కటా
దనుజులచేత జిక్కి నిర ♦ తంబు మహోత్తర దుఃఖవార్ధిలో
మునిగితి నట్టిపాపమను ♦ భూతమె యయ్యెను నాకు లక్ష్మణా!

అక్కటా! హనుమన్నా! ఆ రామచంద్రుడు రావణుని సంహరించి నన్నెన్నడు గొంపోవునో కదా! అంతవరకు నేను బ్రతికియుందునా?

హను—తల్లీ! చింతిల్లకుము.

ఉ. నిక్కము రామచంద్ర ధర ♦ ణీపతి వానరసేనతోడ దా
నిక్కడలిన్ దరించి పడి ♦ నీపురి జేరి విరోధులైన యా
రక్కసులన్ వధించి నిను ♦ రాజితకీర్తి బరిగ్రహించు బెం
పెక్కుసుఖంబులన్ బడయు ♦ దీవు విచారము మాను మమ్మరో!

సీత—వత్సా! హనుమంత! నీవు నిక్కముగ నానాథునకు దూతవు కావు. ఏమందువా! నాప్రాణేశ్వరుండు వచ్చి రక్షించునో లేదోయని నావేణీబంధ మురివోసికొని ప్రాణపరిత్యాగము సేయనున్న నాకు ప్రత్యక్షమై ప్రాణదానం బొసంగితివి నీవు నాకు దైవమవు, రక్షకుడవు, పుత్రుడవు, హితుడవు కావున నీకు నమస్కారములు, స్వాగతములు, ఆశీర్వచనములు, నా నాథుని వేగదోడివచ్చి నన్ను రక్షించుభారము నీది.

హను—తల్లీ! తత్క్షణమే యాప్రభువుని తోడితెచ్చెదను. అట్లుకాక

ఉ. ఇప్పుడె నిన్ను వీపుపయి ♦ నెక్కగ చేసి మహాబ్ధి దాటి రా
మప్రభు జేర్పగా దగుదు ♦ నైనను రామునికీర్తి కెంతయున్
దప్పు ఘటిల్లు నంచును త ♦ ధావిధి సేయగ నొప్పకుంటి నీ
వెప్పటి యట్లు నుండుమిట ♦ నేడ్తెర రాముడె వచ్చి చేకొనున్.

కావున గొలది కాల మోపిక పట్టియుండుము.

సీత—నాయనా! చక్కని మాట జెప్పితివోయి. కష్టముల కోర్చియట్లే యుండెద. మఱియు నానాథునితో నిట్లు చెప్పుము.

చ. నిలువగజాల ప్రాణముల నీపదపద్మములన్ దలంగి, యీ
తులువల రాక్షసాధముల ♦ దుర్భర వాక్యము వహ్ని నామదిన్
మలమల మాడ్చజొచ్చె నిక ♦ మానము ప్రాణము నెట్లు ప్రోచెదో
యలఘుపరాక్రమైకనిధి! ♦ హా హృదయేశ్వర! యంచు జెప్పుమా.

హనుమన్నా! యీచూడామణిని గొంపోయి నానాథున కర్పింపుము.
(చూడామణి నిచ్చును)

హను—తల్లీ! అటులే చెప్పి వేగ దీసుకొని వచ్చెదను. క్షుద్బాధను సహింప లేకున్నవాడ. నాకీవనమునందలి ఫలములను గోసికొనుట కనుజ్ఞనిమ్ము.

సీత—అట్లే కోసికొని భక్షింపుము. కాని అసహాయశూరులైన రాక్షసులు రక్షకులై యున్నవారు. బహుభద్రము సుమీ!

హను—అమ్మా! భయము లేదు. నేను పోయి వచ్చెదను.

సీత—మంచిది నీకు మార్గమున భద్రము కలుగుగాక!

హను—(తనలో) నేను వచ్చి యూరక పోరాదు. ఈవనమును ధ్వంసము జేసి రావణునకు బుద్ధిచెప్పి పోయెదనుగాక (నిష్క్రమించును)

4 వ రంగము :— అశోకవనము

[హనుమంతుడు వనమును పాడుచేయుచు ప్రవేశించును]

రాక్షసుడు—[ప్రవేశించి] ఓరోరి వానరాధమా! యెవ్వడవురా నీవు! మా వనమెల్ల పాడుచేయుచుంటివే? చచ్చితివిరా. (కొట్టును)

హను—ఓరీ నిర్భాగ్యుడా! నీయబ్బతో జెప్పికొనుము. (చావగొట్టును)

రాక్ష—ఓరబ్బో! యిదికోతి కాదురా! దీనిసంగతి మారావణు నితో జెప్పి చంపించెదగాక. (నిష్క్రమించును)

హను—సరే వచ్చినవారినెల్ల జావగొట్టిన దుడుకు రావణుడే రాగ లడు. వానికి నాశక్తిని జూపి పోయెదనుగాక.

అక్షయకుమారుడు—[ప్రవేశించును]

గీ. ఎవ్వడవురోరి వానర ♦ క్రొవ్వుబట్టి
యీవనము పాడుచేయు చు ♦ న్నావు నీవు
ప్రథిత విక్రమ రావణ ♦ బ్రహ్మకలుక
బొడమ నిలుతువె నీవును ♦ భువనచయము.

హను—ఓరీ మూర్ఖా!

గీ. రావణబ్రహ్మ మగడను ♦ రా నిశాట!
నేను కోపించినంతనే ♦ నిఖలభువన
చయముగడగడవడకు భా ♦ స్కరముఖగ్ర
హంబులల్లాడి యిలరాలు ♦ నబ్బు లింక.

నేను దానవులపాలిటి మృత్యుదేవతనుసుమి, కాచికొమ్ము:

అక్ష—ఓరీ వానరాధమ! అటులైన, రావణాత్మజుడైన అక్షయకుమా రుని హేతిఘాతకు బలియగుము. (కొట్టును)

హను—ఓరీ! అధమాక్షయకుమార! చచ్చితివిరా! (చంపును)

రాక్ష—ఓరి బాబో! మా అక్షయకుమారుని చావుకబురు వెల్లగామా రావణబ్రహ్మతో జెప్పెదను (పారిపోవును)

ఇంద్ర—భటులార! వీనినిగట్టి మా జనకుని సభాస్థానమునకు దీసికొ
రండు. బ్రహ్మాస్త్రబద్ధుడగుటచే వీనికేమియు భయములేదు.

రాక్ష—చిత్తము (హనుమంతుని గట్టి మోసికొనిపోవుదురు)

(అందరు నిష్క్రమింతురు)

---

5 రంగము—సభాభవనము

[రావణప్రహస్తులు ప్రవేశించెదరు]

రావ—ప్రహస్త సచివోత్తమ!

సీ. కోతియొక్కడ ప్రబల వి ♦ ఖ్యాతిపరుల
నసుతులనుగూల్చె గడువింత ♦ యుద్యానము
బ్రహ్మమాత్రుడు కాడయా ♦ వానరుఁడు
వనచరుండనరాదు ధృ ♦ ష్టంబుసుమ్ము.

ప్రహ—స్వామీ రాక్షససార్వభౌమా! ఆ వనచరుం డక్షయ
కుమారాది రాక్షసుల ననేకుల జంపుటచే నట్లు తలంపవలసి
నదే కాని మనయింద్రజిత్తు వాని సక్రమంబున బంధించి మీ
సన్నిధికి దేగలడు.

[ఇంద్రజిత్తు హనుమంతునితో ప్రవేశించును]

ఇంద్ర—జనకా! వానరుండు సామాన్యుడు కాకుంటచే బ్రహ్మా
స్త్రమున బంధించి మీసన్నిధికి దోడ్తెచ్చితిని.

రావ—వత్సా! మంచిపని జేసితివి. ఓరీ వానరాధమా!

ఉ. ఎవ్వడవీవు వారినిధి ♦ నేక్రియదాటితి వెల్ల దైత్యులన్
జివ్వదోలంచి చంపి వన ♦ సీమను బాడొనరింప నేలని
న్నెవ్వడు పంపవచ్చితివి ♦ యెయ్యది నామము తెల్పుమోరి! నీ
క్రొవ్వణచంచి మస్తకము ♦ గోసెద నీదుశిరంబు ద్రావెదన్.

రావ—ఓరీ వానరాధమా! నిన్నిదే చంపెదనురా! (కత్తియెత్తును)

ప్రహ—స్వామి! తాళుడు. దూతను చంపరాదు. వీనిచరిత్రమును సాంగముగ నడుగుడు.

హను—రావణ! నాయుపన్యాసము పూర్తియైనపిమ్మట నడుగవచ్చునులే వినుము. నీతో గొంత చెప్పవలసియున్నది.

రావ—అటులైన చెప్పుము.

హను—ఆ శ్రీరామచంద్రుని మహిమంబు చెప్పెదవినుము.

చ. చలమున బట్టి వాలిపటు ♦ చండబలంబున నీవిరాలి జం
కల నిరికించు కొంచు నల ♦ కంధుల జేడిట ముంచినాగ నీ
బలగ యిదేనయున్న రభ ♦ సంబున జావగ ద్రొక్కినట్టి యా
యులఘుని వాలిజంపిన మ ♦ హాత్ముడు రాముడటంచెఱుంగుమీ!

ఒక్కకోలచే వాలిని గూల్చిన సుహాపరాక్రమశాలియైన శ్రీరామ చంద్రునిన్వాలిని జక్కశాలలోనొంటిగనుండగ మృగేంద్రాహారమును జంబుకము తస్కరించిన విధమున తెచ్చితివి. ఆమెయే నీపాలిటి మృత్యుదేవతయని తలంపుము.

రావ—ఓరీ మదాంధా! వ్యర్థప్రలాపీ అదేమిరా ప్రేలెదవు!

హను—ప్రేలకున్న నీకు బుద్ధి చెప్పుటయెట్లు? వినుము శ్రీరామ చంద్రుడు నిర్వికారుడు. అవతారపురుషుడు. కరుణాసముద్రుడు. ఆశ్రితరక్షణుడు, కావున.

చ. బ్రతుక దలంచితేని యపరా ♦ ధిని బ్రోవుమటంచు వేడి యా
క్షితి సుత రామచంద్రునకు ♦ జేర్పుము లేక మదంబుచేత న
ద్ధతి నెదిరించితేని నిను ♦ దప్పక రాముడు ఘోరబాణ సం
హతుల సబాంధవంబుగ మ ♦ హాహవమందు వధించునమ్మమీ.

రావ—ఓరీ వానరాధమా! సమస్తలోకముల జయించిన నావంటివాడొక్క నరాధమునకు నోసిలి మొక్కుదునటరా,

హను—అట్లయిన నీపురేపిన మంటలకు నీకులమెల్ల నాశన మగును. నీశరీరము గ్రద్దల పాలగును.

రావ—ఓరీ వానరాధమా! చచ్చితివిరా. (ఖడ్గమునెత్తి మీదకు పోవును)

విభీషణుడు—అన్నయ్యా! శాంతము. దూతను వధించుట ధర్మము కాదు. (ఆపును)

రావ—అటులైన వీని తోకకు రైలవస్త్రముల జుట్టి యగ్నిముట్టించి కాల్చి పంపుడు.

ప్రహ—అది చక్కని యూహ.

హను—ఓరీ రావణా! నాకీశిక్ష విధించిన ఫలమిప్పుడే యనుభవిం చెదవు.

రావ—ప్రహస్తా! వేగ వీని తోక గాల్చి పంపుడు.

హను—(తనలో) ఈలంకయెల్ల గాల్చిపోయెదనుగాక.

(అందఱు నిష్క్రమించెదరు)

---

6 వ రంగము—కిష్కింధ

[రామలక్ష్మణ సుగ్రీవులు ప్రవేశించెదరు]

రామ—వానరేశ్వరా! సుగ్రీవా!

మ. హనుమన్నాముఖ వానరాగ్రణులు నీ ♦ తాన్వేషణార్థంబు జ
యన్యాన నాశాంతము నేగినారచట నే ♦ మైరోకదా! జానకిజా
గనలేకుంట విషాద వహ్నిబడి భ్ర ♦ గ్నం బాచిరో యేమొ హా
యినపుత్రా! మదితల్లడంబు వడె నా ♦ కేదిక్కు చూపించితో:

సుగ్రీ—స్వామీ! రామచంద్రమూర్తి! పత్నివియోగభరంబున జేసి మీమానసంబు పరిపరివిధంబుల బరితపించుచున్నది కాని హను మదాదులు సఫలీకృత మనోరథులై యింతలోనే రాగలరు. కావున స్థైరింపుడు.

హను—జయము! జయము! శ్రీరామచంద్ర! (నమస్కరించును)

రాము—హనుమంతా! జానకిని జూచితివా!

హను—

ఉ. కాంచితి జానకిన్ దనుజ ♦ కాంతలు కొల్వగ గన్నుల న్నశ్రువుల్
నించుచు రామచంద్ర! ధర ♦ ణీధవ! హా! హృదయేశ నన్ను బా
లించవె యంచు నేడ్చుచు జ ♦ లించెడు దాని లంకలోన నో
సంచిత పుణ్యశాలి! యిక ♦ సాగుము రావణు ద్రుంప వేగమే,

రాము—ఓహో! ఆంజనేయ! నీమహోపకారమును నేను మరువ జాలను కదా! ఆమె యేమని సంభాషించెనో సవిస్తరముగ చెప్పుమా.

హను—మహాప్రభూ! ఆమహాదేవి లంకలోనున్నదని సంపాతియను ఖగేంద్రునివలన విని శతయోజన విస్తీర్ణమైన జలరాశినిదాటి లంకయను పురరక్షకురాలిని ద్రుంచి యందు నరసి తానక తుదకశోకవనంబున దర్శింప

చ. నను గని రాక్షసుండని మ ♦ నంబున సంశయమందు చుండగా
గనకమయాంగుళీయకము ♦ గ్రన్నన దేవి కొసంగినాడ నా
జననియు హర్షమొంది మది ♦ సంశయము న్విడనాడి భక్తిమై
కనులను నద్దికొంచు గుతు ♦ కంబున దాల్చెను గంకణంబుగా.

రాము—ఆహా! నాయంగుళీయకమామెకు గంకణప్రాయమగుటచే నెంతో కృశించినది కాబోలు.

హను—దేవా! ఆమహాదేవి యవస్థనేమని చెప్పుదును. మూర్తీభవించిన శోకదేవతవలె నొప్పుచు వేగవచ్చి రావణాదుల సంహరించి నా చెఱమాన్పి రక్షించుమనియు, లక్ష్మణుని యవివేకంబుచే దూలనాడిన ఫలం బిప్పుడనుభవించుచుంటిననియు బరిపరివిధంబుల శోకించి చెప్పి యానవాలుగ దనశిరోరత్నము నొసంగినది. యిదే! దేవర స్వీకరించెదరుగాక. (యిచ్చును)

రాము—(చేకొని) అహా! ఎన్నిదినముల కాప్తైపిలి శిరోరత్నదర్శనమైనది.

తే. జానకీ విరహాగ్ని ♦ సంతప్తహృదయుఁడ
నైన నాదు తాప ♦ మార్పఁ దీవు
సీతమౌళి గాసి ♦ చేరితివే నన్ను
మహిజమౌళి రత్న ♦ మా కరుణను.

మారుతీ! అంకలి రాక్షసులు నిన్ను గుర్తింపలేదు కదా ?

హను—దేవా ! గుర్తించుటయే కాదు సముద్రోల్లంఘన శ్రమచే జేరాకలివడి యాపనఫలంబుల భక్షించి వనమును విధ్వంసము సేయ నంత రావణసుతుండు అక్షయకుమారుం డనేక రాక్షసులతో వచ్చి నన్నెదిర్చి మడిసినాడు. పిమ్మట రావణపుత్రుడింద్రజిత్తు వచ్చి నామీద బ్రహ్మాస్త్రము ప్రయోగింప నేనందులకు బద్ధుడనై రావణునంతికంబునకుబోయి వానికిబుద్ధిజెప్పితి. వాడందులకు గినిసి నాతోకకు దైలవస్త్రంబులజుట్టి అగ్ని ముట్టించెను. నేనదే సమయమనియెంచి లంకాపురమెల్ల దగుల బెట్టికడలిలో తోక నార్చుకొని దాటివచ్చితి. నిక జాగు సేయక మనసముద్రమును బంధించి లంక మీద దండెత్తవలయును.

రాము—ఓహో హనుమంతా! నాప్రియురాలి సేమమరసి వచ్చుటయె కాక లంకగూడ గాల్చివచ్చితివా! నీప్రభావ మనంతముకదా

సుగ్రీ—దేవా ! ఇక ననంతరకరణీయమునకై త్వరపడవలయును. రండు పోవుదము. (అందరు నిష్క్రమించెదరు)

7 వ రంగము :—లంకాపుర సభాభవనము

[రావణ విభీషణులు ప్రవేశించెదరు]

విభీష—అన్నయ్యా! రావణసార్వభౌమా!

గీ. తరుచర మొకండు జల ♦ రాశి దాటివచ్చి
లంక గాలిచిపోయె ని ♦ శ్శంకగాను
జయము మనకగు ననుమాట ♦ స్వప్నవార్త
సీత రాముని జేర్చుటే ♦ శ్రేయమునుమిం.

రావ—ఓరీ అభిమానహీన! విభీషణ! నీకింత సిగ్గులేదేమిరా!

గీ. పరిభవము జేసినాడు శూ ♦ ర్పణఖ ముక్కు
జెవులునుంగోసి దండక ♦ సీమలోన
ఖర ముఖాద్యసురుల నెల్ల ♦ నురుము జేసె
నట్టి వానికి మనకు స్నే ♦ హంబదేల.

అదియునుంగాక మంచియో చెడ్డయో ఆ రాముని భార్య సీతను చెరదెచ్చితిని. యిపుడొక్క కోతివచ్చి లంక గాల్చిపోయినంతనే భయపడి సీతను రామునకిచ్చుకంటె నావంటి పరాక్రమశాలికి జచ్చుటయే మంచిది. కావున నాకిట్టి విపరీతపు నీతులను జెప్పకుము.

విభీష—అన్నయ్యా! ఆ రాముడు మానవమాత్రుడని తలంపకుము. తాటక సుబాహు ఖరదూషణాది సంహారము మొదలగు చర్యలను, అహల్యాశాపవిమోచనా మహిమములం చిన రాక్షస సంహారమునకై యవతరించిన నారాయణునిగా తలంపవలయు నట్టి శ్రీరాముని భార్య సీతను నీవపహరించుట కులక్షయకారణంబు, ఆ మెలోకమాత. శ్రీదేవి. నీవు త్రిలోకములజయించిన వాడనని గర్వపడుచున్నావు నీవెట్టివాడవైనను నీవొనర్చిన యమంగళకార్యమే నీకు ముప్పుదెచ్చును. అతడు ధర్మమూర్తి ఆశ్రితరక్షకుడు. కావున సీతాదేవినిచ్చి శరణువేడిన రక్షించును

టయు వినియున్నాను. తొల్లి సీతండ్రి విశ్రవసుండు రావణ కుంభకర్ణులు లోకకంటకులై చరించుటచే మడియుదురనియు విభీషణుడొక్కడే వంశకర్తయగుననియు నానతిచ్చెను. నీవు పోయి భగవంతుడైన శ్రీరామునాశ్రయించి బ్రతుకుము. నీకు భద్రంబు కలుగును.

విభీష.—తల్లీ! మహాప్రసాదము. నానమస్కారముల గైకొనుము. (నమస్కరించును)

కైకసి—నాయనా! వంశకర్తవుకమ్ము. (అందరు నిష్క్రమించెదరు)

---

8 వ రంగము : సముద్రతీరము

[రామలక్ష్మణ సుగ్రీవ హనుమంతులు ప్రవేశించెదరు]

సుగ్రీ—స్వామీ! రామమూర్తీ!

ఉ. అల్లదె మింటమేచక మ ♦ హాఘనపంక్తివిధాన వచ్చుచున్
మెల్లన భూమికిన్ దిగెడు ♦ మేదిని వల్లభ! కాంచినావె యా
ప్రల్లదులైన రాక్షసులు ♦ వాయుకుమారుడు లంకగాల్పగా
దల్లడమందుచున్ మనల ♦ దార్కొన వచ్చెనటంచు నెంచెదన్.
కావున మనల చేరకమున్న వారిని బరిమార్చుము.

అందరు—(మింటజూచెదరు)

రాము—సుగ్రీవా! వారిరాకకు గారణమరసిరేని దునుమాడెదనంత వఱకు నిదానించెదను.

విభీషణు—(చేతులుజోడించి ప్రవేశించి)

గీ. శరణు స్వాశ్రితమందార! ♦ శరణు శరణు
సర్వలోకేశ శ్రీరామ ♦ శరణు శరణు
సకల మునిజనసన్నుత ♦ శరణు శరణు
శరణుమాంపాహి రఘురామ ♦ శరణు శరణు.

సుగ్రీవ—మహాత్మ ? రామచంద్ర ! యితడు మనకు ప్రబల శాత్రవు
డైన రావణుని తమ్ముడు. కావున రక్షించుట కనర్హుడు.

రాము—వానరేశ్వరా ! ఇతడు మనకు శత్రుకోటిలోనివాడై నను
శరణన్నవానిని రక్షించుట మనకు విధి కావున రక్షింపకమా
నను. ఓకపికులవరా !

మ. అభయంబిచ్చితి పేర్కొనుడు పుత్రా ! మోదమొందుమా
వ్యభిచారుండగు దుష్టరావణుని ✦ సంహారంబుగావించి ని
న్నభిషేకించెద లంకలో సకల దై ✦ త్యాధీశ రాజ్యంబునన్
శుభమొప్పార దినేశ చంద్ర హిమభా ✦ నుల్ సాక్షిగా నమ్ముమా

విభీష—స్వామీ ! రవికుల కమలాకరద్యుమణీ ! మీసౌజన్యము
భూమి కలంకారము గు. నేను రావణునితమ్ముడను విభీషణుడను.
శ్రీరామచంద్రుని భార్యనపహరించుట మహాపాతకమనియు
మృత్యువును దెచ్చుచేయనియును నిపుడైన నాదేవిని నారా
మున కర్పించి శరణువేడుమని నీతిగబలికినందుల కాతడాగ్ర
హించి సభలోనన్ని వరాభవించి పురమునుండి వెడలనడచె.
నేనాతని దౌర్జన్యమునకు సహింపక మీపాదములాశ్రయింప
వచ్చితి. కృతార్థుడనైతిని.

హను—స్వామీ ! రామచంద్రా ! యాతడానాడు రావణుడు నన్ను
నడుకనుంకింప దూతను వధింపరాదని యాతనికి బుద్ధిచెప్పిన
నీతి శాలి కావున నవశ్యమీతడు మీచే రక్షింపదగినవాడె.

రాము—యోగ్యుడగుట చేతనే యాతడు మనచెంతకు జేరినాడు:
(తెరలో) ఓసుగ్రీవ ! మారావణ సార్వభౌముడు నీకు జెప్పు
మనిన పలుకుల నాకర్ణింపుము. నిన్ను సహోదరునిగ జూచు
చున్న రావణునిపైగత్తిగట్టి సామాన్యతాపసియై రామునితో
సఖ్యముజేయుట బాడికాదు. నీసహాయము లేకున్న నీనరుడు

జలరాసి నుత్తరింపజాలడు. కావున నీయెడల భాతృవాత్సల్య ముంచి యీ రామునివిడచి నీయనుచరులతో నాకుసహాయుడ వుకమ్ము లేకున్న గిష్కింధకుబొమ్ము అని.

సుగ్రీ—(పైకిజూచి) ఓ రావణచారణా! నీవాపంక్తివదనునితో సుగ్రీవునిపలుకులుగా నిట్లు పలుకుము.

సీ. వాలియట్టులనాకు ♦ భ్రాతివౌటనిజంబు
దుష్కార్యమున జెల్మి ♦ తొలగెననుము
ధరణీకుమారిక ♦ దస్కరించుట మృత్యు
దేవతె న్వాయముగా ♦ దెచ్చుటనుము
జగ మరాతిసముగా ♦ సలుపంగ గపులతో
వనధి లీలగదాటి ♦ వత్తుననుము
అలత్రికూటాద్రితో ♦ నాలంకజెకలించి
వారాసిలోగల్పి ♦ వైతుననుము

గీ. రామలక్ష్మణ తీవ్రనా ♦ రాచవహ్ని
రావణద్రోణకర్ణ శ ♦ క్రజిచ్ఛలభ
చయము గాల్చెడు ననివిభీ ♦ షణుడు ముదము
జెందురాక్షస రాజ్యము ♦ శ్రీవహించి.

రాముడు—ఓహో వీడుమనకు భేదభావము గల్పింపవచ్చిన రావణుని దూతవలె నగపడుచున్నాడే!

హను—దేవా! నేనాకసంబున కెగిరి వానిని బట్టి తెచ్చెదను.

(నిష్క్రమించి శుకునిపట్టి తెచ్చును)

శుకుడు—స్వామీ! రామచంద్ర! నేను రావణుని మంత్రిని శుకుడను వాడను. ఈహనుమంతుని తోకదెబ్బలచే జావకుండ రక్షించుము.

రాము—ఓరీ! నీ వెందులకై వచ్చితివి?



# సంపూర్ణ రామాయణము

## దశమాంకము

### 1 వ రంగము :—గగనమండలము

[గంధర్వుడు కలహంస ప్రవేశించెదరు]

గంధ—దేవీ! కలహంస!

గీ. ఏదు సంభ్రమంబు లేకమై ♦ యేగుదెంచు
పగిది రాముడు వానర ♦ బలముతోడ
సరగ నీలంకలో జొచ్చె ♦ హరిహరులకు
నేది దుస్సాధ్యమీభూమి ♦ మీద జెలియ!

కలహ—నాథా! అదిసత్యమే. రాముడు లంకలో ప్రవేశించినాడని విని మంత్రులతో దురాలోచన మొనరించి విద్యుజ్జిహ్వుని మాయాకల్పితరామలక్ష్మణశిరంబుల శరంబులతో సీతయెదుట బెట్టింప నదిగాంచి సీత యెట్లు శోకించుచున్నదో!

గంధ—ప్రియురాలా! ఆశ్చర్యమాశ్చర్యము. అంతలోనే ఆమాయ శిరంబు లంతరించుటచే జానకి శోకమునుండి విడువబడినది. చూడుమా.

కలహ—అమ్మయ్యా! నాప్రాణము లిప్పటికి బొందిలో జేరినవి,

గంధ—చెలీ! అదే మాల్యవంతుడు చెప్పెడునీతులను సరకుసేయక రావణుడు సకలరాక్షస బలముతో వానరబలముతో నప్పుడే

తలపడినాడు. సుగ్రీవుడు రావణునితోఁ దీకొని వానికిరీటము లెట్లు చిదక ద్రొక్కుచున్నాడో.

కలహ—ఈనాఁడు పిల్లలకు నానవలసినదేనా హతిపోయినారు కాని అక్కటా! అంతలోనే యింద్రజిత్తువచ్చి రామలక్ష్మణుల నెట్లు నాగపాశబంధితులఁ జేసినాఁడో!

గంధ—భయపడకుము. నారదప్రబోధితుండై తాను శ్రీపతియని తెలిసికొని గరుత్మంతునిఁదలప నాతఁ డేతెంచి వచ్చి బంధవిముక్తుల జేసినాడు. రాఘవులెట్లు శోభిల్లుచున్నారో చూడుమా.

కలహ—బళే సంతోషమయ్యెను, అల్లదే ధూమ్రాక్షాకంపనులు కాయప్రహస్తులు అంగద నీలాదికపులతోఁ దలపడి మడిసినారు.

గంధ—చెలీ! అవంక జూడుమా, రావణుండు హనుమంతునిచే జావదెబ్బలుతిని లక్ష్మణ సింహాశరఘాతనకుంబుల జర్జరీకృతదేహుండై సహింపలేక కుంభకర్ణుని మేల్కొల్పు భటులను పనుముచున్నాడు.

కలహ—నాథా! వానికి కలతనిద్దురయగుటచే గాబోలు దూలిపడుచు కుంభకర్ణుడు రణరంగమునకు వచ్చుచున్నాడు.

గంధ—అదిగో! తానన్ని నీతులు రావణునకు జెప్పినను వినకుంటచే మండిపడుచు జన్యమునకువచ్చి రామునితోఁ బోరి రసాతలమునఁ గూలినాడు చూడుమా!

కలహ—అబ్బా! చచ్చినను వీనియాకారము భయంకరముగానే యున్నదిగదా!

గంధ—చచ్చినవానినేమి చూచెదవు? అదె కేవలలక్ష్మణుండు విలయకాలరుద్రునివలె మండిపడుచు నింద్రజిత్తునిగూడ గూల్చినాడు. దేవతలు పుష్పవర్షమును గురియుచున్నారు!

కలహ—ధర్మము జయమనుమాట లూరకపోవునా!

గంధ—ప్రియురాలా! నా ధనుర్బలంబును నమ్ముకొని చేపట్టలేని కోపంబున రావణుండు శక్తి నామకాస్త్రము ప్రయోగించి రామానుజుని గూల్చి నాడు. అక్కడా! తమ్ముని యవస్థకు రాముఁడెంతో శోకించుచున్నాడు!

కలహ—నాథా! ఇక మనము ప్రాంతమున నుండి చూచుటకే సౌఖ్యము రండు.

(ఇద్దరు నిష్క్రమించెదరు)

---

షష్ఠరంగము : యుద్ధభూమి

[మూర్ఛిల్లిన లక్ష్మణునితో రాముడు సుగ్రీవ హనుమంత విభీషణులు ప్రవేశించెదరు

రాము—హా సహోదరా! లక్ష్మణా!

ఉ. అన్నను వీడి యుండఁగల ♦ వా నను గన్న తల్లిని భార్య నూర్మిళన్
గ్రన్నన వీడి నా వెనుక ♦ గానల కేగితి భక్తి వచ్చి నీ
వెన్నియొ కష్టముల్పడిచి ♦ యీగతి ప్రాణము బాసినావె! నీ
యన్నల మిన్న కేమిగతి ♦ యంచు వచించెద నయ్య తమ్ముడా!

హా రామమయజీవితా! సౌమిత్రీ! నేనెంత నిర్భాగ్యుడనురా తమ్ముడా!

ఉ. ఖండన రంగమందు బరి ♦ పంథుల మృత్యువురీతి జెండి యు
ద్దండను కీర్తిగాంచియును ♦ దానవనాథుని శక్తిచేత భూ
మండలి గూలినావె ♦ గుణమండన! నిన్ విడనాడ మేనిలో
నుండునె ప్రాణవంచకము ♦ యో! యిక సంగర మేల తమ్ముడా!

హా భ్రాతృవత్సల! హా నిరుపమాన పరాక్రమశాలీ! లక్ష్మణా!

విభీ—స్వామీ! విచారింపకూడదు ధైర్యమవలంబించుడు.

రాము—విభీషణా! తమ్ముని జంపుకొన్న యీ అదృష్టహీనునకు ధైర్య మెట్లువచ్చునోయి! హా సౌమిత్రీ!

చ. కులపతివోవ వేఁడ్రాక తె ౹ గోమలి గూర్చుకోనంగవచ్చు బం
ధుల గడియింపవచ్చు గుణ ౹ ధుర్యుని నిర్మలమైన భ్రాత భూ
తలమున వెత్తకంబు నివరంబు ౹ గోనచ్చిరగాని గాంచగా
గలుగునె! సముత్తము జనకుఁబు వహించిన రీతి నయ్యోగా.

హా లక్ష్మణా! సుమిత్రాగర్భపాథోధిచంద్రా! లక్ష్మణా!

హను——అక్కటా! నా కష్టమంతయు గంగపాలైనది. ఈ మహాత్ముని కంటె నాకుఁబ్రాణము హెచ్చుగనుంచ నేనెట్లు లోదార్చగలుగుదును దైవమా!

రాముడు——

ఉ. అలిని సీత దైత్యులకు ౹ నప్పనచేసి తదాస్యశక్తిచే
గూలిచి నిన్ను గీర్తిరమ ౹ కుక్ వెలియాదను నాయయోధ్యకే
లీలను పోవనొంటిగఁ ౹ లింపక తీజనయిత్రి లక్ష్మణుం
డేలాకొ రాక పోయెనని ౹ యేద్వగ నేమనిపల్కువాఁడరా.

అయ్యో! నాకుమాత్రమిక యయోధ్యయేల? నేనుమాత్రము బ్రతుకుదునా! హా లక్ష్మణా! (మూర్ఛిల్లును)

సుగ్రీవు——(లక్ష్మణుని చూపించి) రామచంద్రా! విచారింపకుము. మన లక్ష్మణుండు మూర్ఛనొందెనో, లేక ప్రాణములనే బాసెనో సుషేణుడువచ్చి నిర్ణయించును.

సుషేణుడు——(ప్రవేశించిచూచి) స్వామీ! మన లక్ష్మణకుమారుడు మూర్ఛనందెను. కాని ప్రాణముల బాయలేదు. హనుమంతుడు సంజీవిని దెచ్చిన జీవింపగలడు. విచారింపకుము.

రామ——(లేచి) సుషేణా నిజమేనా! హనుమన్నా! నీవు మరల పోయి ద్రోణాచలమునుదెచ్చి నాకు భ్రాతృదానమును సేయుమా!

హను——మహాప్రభో! అటులైన తక్షణమేపోయి తెచ్చెదను,

సుషే—ఆంజనేయా! సూర్యోదయము కాకమున్న సంజీవిని తెచ్చితివేని లక్ష్మణుడు జీవింపగలడు.

హను—అట్లయిన నిదే పోవుచున్నాను. (నిష్క్రమించును)

రాము—మారుతీ! నీకు మధ్యేమార్గంబున భద్రమగుగాక! సుగ్రీవా! యిట్టి సుగుణరాశియైన తమ్ముని గోల్పోతినోయి.

ఉ. ప్రాణమువంటి భార్యనెడ ♦ బాసి యిహంబులరోసి తల్లినిన్
మానుగవీడి దేవుని స ♦ మానుడు భ్రాతయటంచు నన్ను స
న్మానముజేసి కానలకు ♦ నావెనువెంటనె వచ్చినట్టి సు
జ్ఞానినివీని లక్ష్మణుని ♦ సంగరమందున జంపుకొంటిగా.

సుగ్రీ—స్వామీ! విచారింపకుడు. హనుమంతుడు సంజీవినితెచ్చుట తడవుగా మీయనుజుండు బ్రతుకగలడు.

రాము—(తూర్పువైపుజూచి రోషముతో) ఔరా! ఏమీ! యీ ప్రభాకరుని దౌర్మదము.

ఉ. ఓవనజాప్త నాయనుజు ♦ డుర్విని మూర్ఛిల వాయుజుండు సం
జీవినితెచ్చి లక్ష్మణు స ♦ జీవునిగా నొనరింపకుండగా
నీవిధి దూర్పుకొండ నుదు ♦ యింతువె యాత్మకులాభిమానమున్
బోవిడి మచ్ఛితాస్త్రముల ♦ భూమిని రాల్చెద నిన్ను జూడుమా!

(బాణము నెక్కుపెట్టును)

సుగ్రీ—మహాత్మా! శాంతింపుము.

క. ఏవిధాన లక్ష్మణుని స ♦ జీవుఁజేతు
ననుచు మారుతికృతకార్యు ♦ డగుచు దెచ్చు
ద్రోణగిరిమీది యోషధీ ♦ ద్యుతులె కాని
కమలమిత్రుని యుదయంబు ♦ కాదు దేవ!

రాము—ఔనోయి సుగ్రీవ! నేను మతిలేక యట్లుతలచితి నల్లదే హనుమంతుడే సంజీవితో వచ్చుచున్నాడు.

రావణుండు—(ప్రవేశించి) ఓరీ లక్ష్మణా! చచ్చితివనుకొంటిని కాని తిరిగి అంజనీసుతుడు సంజీవిని దెచ్చుటచే మరల బ్రతుకగంటివా రమ్మొకసారి నీప్రాణముల దీసెదను.

లక్ష్మ—ఓరీ దశకంధర! నీకంఠరవిభాగమన మహోత్సవమిప్పుడే యగును కాచికొనుము.

రాము—తమ్ముడా! నివటంతొలగుము ఓరీ రావణా! లోకవిద్రావణా!

ఉ. పరమపతివ్రతామణుల ♦ బల్మి మెయిన్ జెఱదెచ్చినట్టి నీ
గురుతర పాపసంచయము ♦ కోటిసగణాధికమై మదీయభీ
కరశరవహ్ని వ్యాజమున ♦ గ్రస్సన నిన్ దహించుజుమ్ము నం
గరమున దుష్కృతమ్ము వృథగా ♦ హరించునె! దానవాధమా

కావున వలసియున్న నవివానితో నీకేలకి నాతో రణము సేయుము

రావణు—ఓరీ నరాధమా!

ఉ. తాటక నాసుబాహు ముఖ ♦ దానవనాథుల గూల్చినంతనే
పోటరినంచు గర్వమున ♦ బొంగకుమో రఘురాము! నిన్ను నా
ఖేటము చేత ద్రుంచి ఘన ♦ కీర్తిని గాంచెద నన్నెదుర్చ నా
హాటకగర్భ శంకర ము ♦ ఖామరులకైన వశంబె! యాజిలో.

కావున నేడీవైశ్రవణునిచే నీకాయువు మూడిన దనితలంపుము.

రాము—ఓరీ రాక్షసాధమా! ఎందులకీ ప్రతాపములు? నిన్ను నిర్జించుటకు బ్రహ్మాదులేల నేనేల? నీదుష్కృత్యమే చాలును రారమ్ము రణమునకు.

రావ—ఓరీ! దాశరథీ! నేను సుకృతములనే చేసితినో దుష్కృతములనే చేసితినో తెలియుటకు నీవెంతవాడవురా!

చ. గురుతరభక్తి నేను నవ ♦ కోటి శివాలయశంకరార్చనా
భిరతిని బొల్చినాడ భుజ ♦ విక్రమ నిర్జిత నిర్జరేంద్రుడై
వరలుచునుండు నా సుకృత ♦ వైభవమీవు హరించినంతనే
దొలగునె! వ్యర్థవాదముల ♦ తో బనియేల రణమ్ము సేయుమా,

రాము—ఓరీ నిశాటాధమా !

చ. విమలసుధాబ్ధిలోన విష ♦ బిందువు గల్గ ఫలంబు జెందిన
ట్లమరవిరోధ ! సీతను శ్రీ ♦ వాస్తవపుణ్యఫలంబు నీవు దా
ర్ష్ట్యమునను దగ్ధమయ్యెను దృ ♦ ణంబుగనమ్ముము తావకీనప్రా
ణములకు మృత్యువౌ జనక ♦ నందనబట్టిన రిత్తవోవునే.

రమ్మిక యుద్ధము సేయుము.

రావణ—రామా ! నా పుణ్యఫలము దగ్ధమయ్యెనో నిన్ను జంపు వల్ల నైదగ్ధమునే కాంచెనో యిప్పుడేజూచెదవుగాక రమ్ము.

మాతలి—(ప్రవేశించి) మహాత్మా ! నేనింద్రసారథిని మాతలిని. పురందరుడు సభక్తికంబుగ మీకొరకీ రథముబంపి దోలి తెచ్చితిని. అధిష్ఠించి సమర మొనర్పుడు.

రాము—దివ్యుల కృపాభిషేకమునకు సంతసించితి. ఓరీ రావణ ! ఆ నిర్మల స్థలమునకుబోయి యుద్ధము జేయుదమురమ్ము.

రావణ—మంచిది. (యిద్దరు నిష్క్రమింతురు)

సుగ్రీ—రామానుజా ! వానరులారా ! రామచంద్రుడు రావణ సంహారార్థమతరించుటచేతనే యింద్రుడు రథమునుబంపినాడు.

విభీష—అందుకు సందియమేమి ! అల్లదేచూడుడు, మహాత్ముడు రావణునెట్లు బాణవర్షమున ముంచుచున్నాడో !

హనుమం—ఆహా ! రామ రావణ సమరము దుర్నిరీక్ష్యముగనున్నది కదా !

గీ. రామబాణాళి మేను ♦ ఛిద్రములసేయ
రక్తధారల గుతియు నా ♦ రావణుండు
మొత్తికాల్వలబారు మ ♦ హీధ్రమనగ
నొప్పుచున్నాడు కనుడు ర ♦ ణోర్వియందు.

సుగ్రీ—అన్నన్నా ! ఇదేమి విచిత్రమోయి విభీషణా !

ఉ. రాముడు త్రుంచివైచినను ♦ రావణు వింశతి బాహువుల్ తలల్
వేమరు మొల్చుచుండె నిది వింతకదా! ♦ భవదీయ సోదరుం
డేమి తపంబుజేసెనొకొ ♦ యిట్టి విచిత్రముగాంచి రాముడ
ద్యో మదిదోచకుండె సమయోచిత కార్యము జెప్పవేసఖా!

విభీ—సుగ్రీవాదులారా! మీరందులకై చింతిల్లకుడు. దీనికుపాయము రామచంద్రునికే యెఱిగించెదను వినుడు, మహాత్మా! రామచంద్రా!

ఆ. వె. అమృతకలశ నాభి ♦ యందుండునట్లుగా
నజుడు వరమొసంగె ♦ నందుచేత
తలలు మొలిచె నాభి ♦ తలమును గొట్టుమా
పావకాస్త్రమునను ♦ భవ్యచరిత.
అట్లుచేసిన కాని వీడు సాధ్యుడు కాడు.

హనుమం—ఓహో! అధర్మపరున కాత్మజుడైన సాయపడుకదా!

సుగ్రీ—(హర్షముతో) అదిగో రావణుడు కూలినాడు. ఇప్పటికి గదా కృతార్థులమైతిమి!

విభీ—(కూలబడి) హా అగ్రజా! రావణా! నీ కెంతగతిపట్టినదోయి;

మ. పరకాంతామణులన్ హరించుట మహా ♦ పాపంబు వద్దంచు వే
మరు సద్బోధనజేసినన్ వినవయి ♦ మ్మాడ్కిన్ రఘూత్తంసు భీ
కరశస్త్రంబులగూలితే! శివశిరః ♦ కంజంబునై యొప్పు నీ
శిరమున్ గ్రద్దలుతన్నునే ♦ నెటుల వీక్షింతున్ గదా సోదరా!

రాము—(ప్రవేశించి) మిత్రమా! విభీషణా! నీ యగ్రజుం డిహమున జేసిన పాపము నిహలోకముననే యనుభవించి నాచే గూలి యదే పుష్పకారూఢుడై పుణ్యలోకముల కేగుచున్నాడు. అదే చూడుమా నీ వాతనికొరకై విచారింపకుము.

విభీ—స్వామీ! చిత్తము.

రాము—హనుమంతా! రావణుని కిరీటము నిటు తెమ్ము.
హను—(తెచ్చియిచ్చును)
రాము—విభీషణా!

శా. శంకింపంబనిలేదు రావణుడనిన్ ♦ దచ్చెంగదా యత్నించు న
త్వంకంబింతయు నెన్న జేకొనవె యీ ♦ దైత్యాధిపత్యంబు నా
పంకేజాప్త సుధాంశు తారకముగా ♦ పాలించుకొమ్మింక నీ
లంకారాజ్యము నో విభీషణ! గుణా ♦ లంకార దైత్యేశ్వరా!

(కిరీటము విభీషణుని శిరమున బెట్టును)

విభీ—స్వామీ! మహాప్రసాదము. నేనిపుడేపోయి సీతామహాసాధ్విని దెచ్చి సమర్పించెదను (నిష్క్రమించి సీతతో ప్రవేశించును)
సీత—హా ప్రాణేశ్వర! (నమస్కారము చేసి పదములబడును)
రాము—దేవీ! నీకు భద్రముగలుగుగాక! నీ చెరమాన్పితిని కాని చిర కాల మసురసన్నిధినుంటచే నీవగ్నిచేత బరిశుద్ధురాలవైన గాని పరిగ్రహించుటకు యోగ్యురాలవు కావు.
సీత—హా దైవమా! సరే నాథా! నిర్దోషినైన నేననలపరిశుద్ధినిగాం చుటకు సంశయింతునా!
రామ—పావనీ! నీవుపోయి యగ్నిని బ్రజ్వరిల్ల జేయుము.
హను—చిత్తము. (నిష్క్రమించును. తెరలో అగ్నిమండును)
సీత—ఓహో! భగవంతుడు వైశ్వానరుండిట్లు వెలుంగుచున్నాడో! స్వామి! వీతిహోత్రా! దేవముఖ (అగ్నిని జేరి)

చ. నిరతము రామచంద్ర ధర ♦ ణీపతినే మదినెంచితేని యా
శరపతిపంక్తికంధరుని ♦ స్వప్నము నందున నైన దల్పకుం
దరహిం దెలంగితేని సుజన ♦ స్తుత పూతచరిత్ర నేని యీ
యురుతరవహ్ని శాంతమయి ♦ యొప్పుచు నన్దహింప కుండుతన్.

(అగ్నిలో నురుకును)

విభీ—ఓహో! మహాపతివ్రత నాదరించి హవ్యవాహనుండు స్వయముగ జానకీదేవి నిటు తోడి తెచ్చుచున్నాడే!
అగ్ని—మహాత్మా! రామచంద్రా! యీసీతామహాదేవి నాకీలలలో ప్రవేశించుటచేత నాపాపములుగూడ బాసిపోయినవి. యీదే

అసురకులము సంహారము గావించి ! అసురసంతతికి జయము గూర్చిన మేటి ! అనుచు దొలంగి మిా ! కేసుగాయుతులమయ్యు ! వెర దుఃఖాబ్ధిని ద్రోసితివయ్యో ||హా|| తరణి||

2. ప్రాణములైదును ! రాముడిట్లు విడి ! నాకలకే నేరానోడువలేక ! హా నాసుతులార ! రామలక్ష్మణులార ! అనుచు ప్రాణముల ! త్యజించితావె ||హాతరణికుల||

8 [సాంగు రాముని శోకాగ్ని వర్ణించుట]

శంకరాభరణము—త్రిపుట

1. ఎంతో అందగాడో ! యీరాముడా ! చంద్రుడు ||ఎంతో||
నగుమోమున వెన్నెలబోలిన ! నవ్వులొలయు కన్నులు కల్వలు యింద్రనీల కంతులవలె జూడ ! సాంద్రనీలదేహము వీని హాయి ఆహా ||ఎంతో||

2. ఔరా యీమోహనమూర్తి ! జేరి కౌగిలించి సుధారస ధార లొల్కు మోవిని గ్రోలని ! వారిజన్మమేల ఈసుంధర వహ్వా ||ఎంతో||

[సాంగు సీత రాముని లేపినదెమ్మనుట]

9 మోహనరాగము—ఆదితాళము

1. నాముద్దు చెల్లింపవె ! నాప్రాణనాథా ||నాముద్దు||
ఆ పైడిలేడిజాడ ఆనందమాయెన్ ! తెమ్మో ||నాముద్దు||
బంగారురంగు వనమునందు హా ! రంగైన మేనవెలతళ్కుల ! సంగాను చుక్కలొప్పునిలుమా ! లంగేరు చూడ్కులొలయ నాసా ! రంగంబు నెత్తికొనుచునా జెద భంగంబులేదు ! నాకొసంగుమివేగ ||నాముద్దు||

[సాంగు సీత రామునిరక్షింప లక్ష్మణునిపొమ్మనుట వైలాగు]

10 దర్బారు—రూపకము

సీత—! హా లక్ష్మణా హాతోస్మి ! యనుచును నానాథుడార్చెను !
వైళమ సీవటుకేగుము ! పాలింపగరాదా వాదా ||హా||

3 జీవము కేలానాకు । ఇక తేనా నీవేగ । నీవెను వెంట నేఁ । పోవ
లెనన్నదయా ॥హా కపి॥

సాంగు హనుమంతుడు సీతను జూచి

16 తోడి—త్రిపుట

1 కాంచితి జగన్మాతా సీతాగమను ॥కాంచితి॥
సంచిత పుణ్యము చేత నా । గాంచితి రాముని కార్యము । అంచితా
పాదన్యాసమున నే । రించి నాడ నాటిధిలంకిణి । ద్రుంచి సౌధముల
గానక యరు । దెంచి యారామశోకము చెంతను, నే ॥కాంచితి॥
2 వాలములంకాపురి గోపుర । జాలములకు వెనవైచియు బా । తా
ళమంత బెకలించుచు నా । దర్పమెప్పగొని రామునకర్పింప॥

(సాంగు సీత హనుమంతునితో)

17 బిళహరి—ఆటతాళము

1 విన్నవింపవె యో హనుమన్నా నా । విన్నపమా రఘు । వీరున
కో యన్నా ॥విన్నవింపవే॥
హా రామ హా రామ । హా రామయనుచు నా । హా రా నిద్రలుమాని
యుడలు చుంటిననుచు ॥విన్నవింపవె॥
2 కానయూపిరితోనుంటి ననుమిా । నేలు కొనకున్న మనజాల
ననుమిా । నీ మాట దాటిన నేరము లక్ష్మణుని । పరుషములాడిన
పాపమందితి ననుచు ॥విన్నవింపవె॥

(సాంగు రాముడు లక్ష్మణుని మూర్ఛచే శోకించుట)

18 సింధుకమాంచి రాగము—ఏక తాళము

1 హా నను బాసితివా! । హా నా తమ్ముడా ॥హా నను॥
రావణశక్తి నీ । ప్రాణము దీసెనే । యే విధి జీవింతు నేనిక లక్ష్మణ
2 ప్రాణము బంధులు భార్యయు నా కేలా । నీ వెను వెంట నే । వచ్చెద
నేనును ॥హా నను బాసి॥
3 తమ్ముడేడి రాయని । తల్లి నన్నడిగిన । యేమియ్యి-నేవచి-యుంచెద-
నయ్యయొ ॥హా నను బాసి॥

# జ్యోతిష గ్రంథములు

| | | |
|---|---|---|
| జ్యోతిష ప్రశ్నబోధిని | 0 | 8 |
| జాతక మార్తాండము 1 వ భా॥ | 2 | 0 |
| డిటో 2 వ భా॥ | 2 | 0 |
| డిటో 3 వ భా॥ | 2 | 0 |
| జ్యోతిష రహస్యము 1 వ భా॥ | 2 | 0 |
| డిటో 2 వ భా॥ | 2 | 0 |
| జ్యోతిష విద్యాప్రకాశిక | | |
| సంజ్ఞాధ్యాయము 1 వ భా॥ | 1 | 0 |
| గణితాధ్యాయము 2 వ భా॥ | 1 | 0 |
| భావఫలాధ్యాయము 3 వ భా॥ | 3 | 0 |
| అదృష్టదీపిక | 0 | 10 |
| హస్తసాముద్రికము | 0 | 6 |
| జ్యోతిషఫలప్రదర్శిని | 0 | 12 |
| స్వప్నఫలదీపిక | 0 | 8 |
| సకలసమస్తగుణ అదృష్టఫలదీపిక | 1 | 0 |
| గౌతమసంహిత | 0 | 8 |
| వాంఛాసాక్షీయము | 0 | 8 |
| కోడిపుంజుల శాస్త్రము | 0 | 8 |
| అంగసాముద్రికము | 0 | 8 |
| జాతకదర్పణము | 0 | 12 |
| జాతకపారిజాతము | 1 | 0 |
| జాతకరాజీయము | 1 | 0 |
| ప్రపంచ జ్యోతిషము | 0 | 4 |
| జ్యోతిషఫలగ్రంథము | 0 | 4 |
| పంచపక్షి ప్రశ్నశాస్త్రము<br>కేరళ ప్రశ్నశాస్త్రము<br>ఉత్తమ ప్రశ్నశాస్త్రము | 1 | 0 |
| శకునశాస్త్రము | 0 | 12 |
| స్త్రీజాతకము | 0 | 12 |
| యవనజాతకము | 0 | 8 |
| జ్యోతిషార్ణవనవనీతము | 1 | 0 |
| దైవజ్ఞ కర్ణామృతము | 2 | 8 |
| దశాభుక్తిఫలచంద్రిక అను వృద్ధపారాశరి | 1 | 0 |
| ప్రశ్నమద్వాళశాస్త్రము | 0 | 8 |
| జాతకచంద్రిక గోపాలరత్నాకరము | 0 | 12 |
| నవగ్రహచింతామణి | 0 | 4 |
| స్త్రీఋతుశాస్త్రము అను రజస్వలా జాతకము | 0 | 12 |
| మూలస్తంభం (శైవగ్రంథం) | 1 | 0 |
| గర్గసంహిత | 0 | 4 |
| జయమినీ సూత్రములు | 1 | 0 |
| అనుభవజాతకతరంగిణి | 0 | 8 |
| ప్రాక్పారాశరి | 0 | 8 |
| బృహత్పారాశరసంహిత | 0 | 4 |
| ఆంధ్రజాతకతత్వము సూత్రములు 1, 2 భాగములు | 3 | 0 |
| గోచారసంహిత | 0 | 12 |
| శిల్పసంగ్రహము | 0 | 6 |
| కాలామృతము | 1 | 0 |
| ఆయుర్దాయయోగము | 1 | 0 |
| ముహూర్తదర్పణము | 1 | 0 |
| రెట్టమతశాస్త్రము (60 సంవత్సరముల పంట వెల్లు గ్రంథము) | 1 | 0 |
| సర్వార్థచింతామణి ద్వాదశభావములు, దశాంతర్దశ వివరములు గల సంపూర్ణమూలగ్రంథము) | 1 | 0 |
| అష్టకవర్గ | 0 | 12 |
| జలార్గళశాస్త్రము | 0 | 6 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమహేంద్రి.

# ఆంధ్రనాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| చిత్రనళీయము | 1 | 12 | విప్రనారాయణ | 1 | 12 |
| విషాద సారంగధర | 1 | 12 | రాధాకృష్ణ | 1 | 8 |
| పాదుకా పట్టాభిషేకము | 1 | 8 | కోకిల | 1 | 12 |
| సావిత్రీ చిత్రాశ్వము | 1 | 8 | వీరమతి | 1 | 8 |
| ముక్తావళి | 1 | 8 | సరస్వతి | 1 | 8 |
| ప్రహ్లాద | 1 | 8 | పూర్ణిమ | 1 | 8 |
| రామదాసు | 1 | 8 | చండిక | 1 | 8 |
| రామకబీరు | 1 | 8 | శివలీల | 1 | 8 |
| సుభద్రార్జునీయము | 1 | 8 | సతీతులసి (జలంధర) | 1 | 8 |
| అస్పృశ్య విజయము (ప్రేమ చంద్రయోగి) | 1 | 8 | గయోపాఖ్యానము | 1 | 12 |
| భక్తతుకారామ్ | 1 | 8 | ప్రసన్నయాదవము (నరకాసుర వధ) | 1 | 8 |
| కృష్ణలీల | 1 | 8 | పారిజాతాపహరణము | 1 | 8 |
| [illegible] | 1 | 8 | చతురచంద్రహాస | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 | సుందోపసుందులు (తిలోత్తమ) | 1 | 8 |
| మేవాడు శౌర్యాగ్ని | 1 | 8 | కనకతార | 1 | 8 |
| విభీషణ పట్టాభిషేకము (లంకాదహనము) | 1 | 3 | బలిబంధనము | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 | రాధాకృష్ణ సాంగ్సు | 1 | 0 |
| రామరావణ యుద్ధము | 1 | 3 | శ్రీకృష్ణతులాభారము సాంగ్సు | 1 | 0 |
| పాండవ జననము | 1 | 4 | సక్కుబాయి | 1 | 8 |
| పాండవ ప్రవాసము | 1 | 8 | సావిత్రి | 1 | 8 |
| పాండవ ఉద్యోగము | 1 | 12 | లలిత | 2 | 0 |
| పాండవ విజయము | 1 | 12 | దివోదాసు | 2 | 8 |
| పాండవ రాజసూయము | 0 | 8 | చంద్రగుప్త | 1 | 0 |
| పాండవ అశ్వమేధము | 1 | 8 | దుర్గాదాసు | 2 | 0 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | 1 | 4 | రాజా ప్రతాపసింహ | 1 | 8 |
| పండితరాజము | 1 | 0 | పత్నీప్రతాప్ (అనసూయ) | 1 | 8 |
| మృచ్ఛకటికము | 2 | 0 | శ్రీకృష్ణతులాభారము | 1 | 12 |
| ముద్రారాక్షసము | 1 | 8 | రణతిక్కన | 1 | 8 |
| అనర్ఘనారదము | 0 | 8 | కచదేవయాని | 1 | 8 |